నోరూరించే... మనసుదోచే... మైమరపించే.









క్రొత్త పార్లే

# పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు.
తక్కువ వెలగల మక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్ నారగించండి-

everest/122b/PP Tel

ప్రతి గ్రంథాలయంలోను
ఉండితీరాలి!



శ్రీమతి మధురం భూతలింగం
రచించిన ఇంగ్లీషు పుస్తకాలు

**'SONS OF PANDU'**
Rs. 5-25

**'THE NECTAR OF THE GODS'**
Rs. 4-00

పిల్లలకు బహుమతిగా
ఇవ్వతగినవి.



కాపీలకు:

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

చేరండి విజయ
శిఖరానికి
శ్వాన్
పెన్నులతో

పరీక్షల లో విజయం శ్వాన్ పెన్నులతో ఎంతో సులభమని మీరు గ్రహిస్తారు. మీ వ్రాత మెత్తగా తేలికగా ప్రవహిస్తుంది. శ్వాన్ లక్స్ పోర్ట్ లేక లేండిర్స్ని వాడి చూడండి—ప్రత్యేకంగా విద్యార్థులకై సృష్టించ బడింది.










శ్రేష్ఠమైన ఫలితాల కోసం
శ్వాన్
డీలక్స్ ఇంకుతో
వ్రాయండి.










శ్వాన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
అద్వాని చాంబర్స్ పి. మెహతా రోడ్డు, బొంబాయి-1
బ్రాంచి: 34బి. కన్నాట్ ప్లేస్ క్రాస్ ఢిల్లీ.

hero's SI-119 U

# ఏనుగును తినడం ఎలాగ



## ఔను ఔను ఏనుగే!

ఏనుగులు తియ్యగా గరగరలాడుతూ
తినడానికి పసందుగావుంటాయి.
అతి సులభంగా జీర్ణమవుతాయి కూడా.
అల్లాగే వుంటాయి
పులులు, సింహాలు,
జిరాఫీలు, హిపపాటమస్సులు,
కంగారులు, కుందేళ్లు, ఒంటెలు
ఒక మేటి బ్రిటానియా బిస్కట్ల
కంపెనీవారు తయారుచేసేవి—
అన్నీ. అవి బ్రిటానియా
బిస్కట్ల రూపంలో ఉంటాయి.
నోటిలో వేసుకోడానికి
అనువుగా వుండి ప్రతివారికి
విందు కల్పిస్తాయి. మీరు
వాటిని తిని ఆనందించండి.
జూనంతా మింగేయవచ్చు!
ఔను బ్రిటానియా జూ.





## బ్రిటానియా జూలాజికల్ బిస్కట్లు

**భారతదేశంలో అతి శ్రేష్ఠమైన బిస్కట్లు** బ్రిటానియా

BBC-2769

బ్రతకలేక బడిపంతులు అనే లోకోక్తిని మార్చి బ్రతికించే ది
బడి పంతులే నన్నది వేదోక్తిగా చాటిన మహనీయుని జీవితగాథ



# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["కీర్తి సాధనం"] ''అపర్ణ'' అనేవారు పంపినది. ఈ కథలో గుణకీర్తి అనేవాడు సత్వం గలవాడు. ''క్రియా సిద్ధి స్సత్త్వే భవతి మహతాం, నోపకరణే'' (మహాత్ములకు క్రియాసిద్ధి ఉపకరణాలవల్ల గాక సత్వం వల్లనే సాధ్యమవుతుంది) అని ఏనాడో చెప్పారు.

ఒక మంచి రాజ్యాంగ పాలనను కూల దోయడానికి ఎలాంటి కుయుక్తులూ, తంత్రాలూ పన్నుతారో దివోదాసుడి కథ [శివపురాణం] తెలుపుతుంది.

సంపుటి 51 నవంబర్ '72 సంచిక 5




శత నిష్కో ధనాఢ్యశ్చ,
శతగ్రామేణ భూపతిః,
శతాశ్వః క్షత్రియో రాజా,
శతశ్లోకేన పండితః. 1

[నూరు నిష్కాలు—బంగారు మాడలు—గలవాడు ధనికుడు. నూరు గ్రామాలు గలవాడు భూపాలుడు. నూరు గుర్రాలు గలవాడు రాజక్షత్రియుడు. నూరు శ్లోకాలు నేర్చినవాడు పండితుడు.]

శకటం పంచహస్తేషు,
దశహస్తేషు వాజినం,
గజం హస్తసహస్రేషు,
దుర్జనం దూరతః త్యజేత్. 2

[బండిని అయిదుమూరల ఎడంలోనూ, గుర్రాన్ని పదిమూరల ఎడంలోనూ, ఏనుగును వెయ్యిమూరల ఎడంలోనూ, దుర్జనుణ్ణి దూరంగానూ తప్పుకోవాలి.]

కృషితో నాస్తి దుర్భిక్షం,
జపతో నాస్తి పాతకం,
మౌనేన కలహో నాస్తి,
నాస్తి జాగరతో భయం. 3

[పొలం చేసుకునేవాడికి కరువు లేదు. జపం చేసుకునేవాడికి పాపం లేదు. మౌనంగా ఉన్నవాడికి కలహం లేదు. మేలుకుని ఉన్నవాడికి భయం లేదు.]

ప్రమాణాలు



# కాపూ-తోడేలూ

ఫ్రాన్సుదేశంలో ఇప్పుడు పెద్ద మైదానంగా ఉన్న ప్రాంతంలో ఒకప్పుడు విస్తృతమైన అరణ్యం ఉండేది. ఆ అరణ్యం కాలిపోవటానికి కారణం ఈ విధంగా చెబుతారు:

అరణ్యం అంచున ఒక పేదకాపు తన భార్యతో నివసిస్తూ ఉండేవాడు. ఒకనాడు ఆ కాపు రెండు పెద్ద రొట్టెలు కొని, అరణ్యం కుండా ఇంటికి వస్తూ ఉండగా ఒక పెద్ద తోడేలు చెట్ల చాటు నుంచి వచ్చి, అతని దారికి అడ్డంగా నిలబడింది. ఆ తోడేలు బక్కచిక్కి, చర్మం ఎముకలకు అంటుకుపోయి ఉన్నది. అది గుహ లాటి నోరు తెరిచి, కాపు కేసి చూస్తూ గుర్రు పెట్టింది. దాని కోరలు చాలా పెద్దవిగా, భయంకరంగా ఉన్నాయి.

కాపు ఆ తోడేలును చూసి భయంతో కొయ్యబారి పోయాడు. పారిపోవటం అసంభవం. అంత పెద్ద తోడేలుతో అతను పోరాడి జయించనూ లేదు. అంతలో అతనికి ఒక ఆలోచన వచ్చింది. అతను తోడేలుతో, "నీకు, పాపం, అకలిగా ఉందా, తోడేలూ! ఈ రొట్టె కొంచెం తిను," అంటూ, ఒక పెద్ద రొట్టె నుంచి ఒక ముక్క తుంపి తోడేలుకు వేశాడు. తోడేలు దాన్ని తీసుకుని ఆప్యాయంగా తినసాగింది. అదే సమయమనుకుని కాపు దాని పక్కగా జారుకుని, ముందుకు పోసాగాడు.

ఎంతో దూరం పోకముందే తోడేలు తనను వెంబడిస్తున్నట్టు అతనికి తెలిసింది. "మంచి తోడేలు! ఇంకాస్త తీసుకో," అని తోడేలుకు మరొక రొట్టెముక్క వేసి, కాలి సత్తువ కొద్దీ పరిగెత్తసాగాడు కాపు.

కాని తోడేలు అతన్ని వెంబడించటం మానలేదు. కాపు రొట్టె తుంచి వేస్తూనే ఉన్నాడు, అతను వేసే రొట్టెముక్కలు తింటూ తోడేలు అతన్ని వెంబడిస్తూనే

ఫ్రెంచి జానపద కథ




ఉన్నది. అతను ఎంత వేగంగా పరిగెత్తినా తోడేలు అతన్ని వెంబడించటం మానలేదు.

చిట్ట చివరకు ఆయాసంతో రొప్పుతూ కాపు తన ఇంటికి వచ్చి పడేసరికి, అతని రెండో రొట్టెలో ఒక చిన్న తుంపు మాత్రమే మిగిలింది. తోడేలు అతని వెనకగా వచ్చి, అతని ఇంటి ముందు కూర్చున్నది.

కాపు భార్య, తన భర్త ఉత్త చేతులతో రావటం చూసి, "రొట్టెలేవీ? రొట్టెలతో తినటానికి అంబలి సిద్ధం చేసి ఉంచాను." అన్నది.

ఊపిరి కూడా అందని స్థితిలో ఉన్న కాపు తన భార్యకు ఇంటి బయట ఉన్న తోడేలును చూపాడు.

"తోడేలే! అందుకే అలా పరిగెత్తు కొచ్చావు! ఇంకా నయం, నువు దానివాత పడలేదు!" అన్నది భార్య.

"మనం తినటానికి కొన్న రొట్టెలు దానికి వేశాను," అన్నాడు కాపు.

"నిక్షేపమంటి రొట్టెను దిక్కుమాలిన తోడేలు మింగేసిందా? ఏం చోద్యం! నువు లోపలికి వచ్చి, తలుపుమూయ్యి. లేకపోతే అది నిన్నూ, నన్నూ కూడా మింగేస్తుంది," అన్నది కాపు భార్య.

కాపు తలుపు మూయబోతూ, తన చేతిలో మిగిలి పోయిన రొట్టె తుంపును తోడేలుకు వేస్తూ, "ఇది కూడా నువే తిను, తోడేలూ," అని తలుపు గడియ పెట్టేశాడు.

తోడేలు ఆ ముక్క కూడా తినేసి చాలా సేపు ఆ ఇంటి బయటనే కూర్చున్నది.

లోపల భార్యాభర్తలు ఉత్త అంబలి ఆరగించసాగారు. తింటున్నంతసేపూ కాపు భార్య తోడేలును శాపనార్థాలు పెడుతూనే ఉన్నది. లోపల సంభాషణ ముగియగానే తోడేలు అరణ్యంలోకి వెళ్ళిపోయింది.

తరవాత కొన్ని నెలలు గడిచాయి. కాపూ, అతని భార్యా కష్టపడి పని చేసి కొంత డబ్బు కూడబెట్టి, దానితో ఒక ఆవును కొనటానికి నిశ్చయించారు.

కాపు ఆ డబ్బు తీసుకుని అరణ్యం గుండా సంతకు బయలుదేరాడు. సంతలో

అతను తన దగ్గిర ఉన్న డబ్బుకు ఏ వయసు మళ్ళిన ఆవుగాని వస్తుందేమోనని చూస్తుం డగా ఒక సన్నని, పొడుగాటి మనిషి అత నికి ఎదురు పడి, "ఆవును కొంటున్నావా?" అని అడిగాడు.

"అవునండీ! కాని నా దగ్గిర మంచి ఆవును కొనటానికి తగినంత డబ్బు లేదు," అన్నాడు కాపు.

"మా కొట్టంలో చాలా ఆవులున్నాయి. వాటిలో నీకేదన్నా నచ్చుతుందేమో చూడు," అన్నాడు ఆ పెద్ద మనిషి.

ఇద్దరూ కలిసి ఒక చక్కని ఇంటికి వెళ్ళారు. ఇంటివెనక ఆవులకొట్టం ఉన్నది.

"అన్నిటిలోకి మంచి ఆవును ఏరుకో," అన్నాడు పెద్దమనిషి. కాపు ఆ ఆవులలో తనకు శ్రేష్ఠంగా కనిపించిన దాన్ని ఎన్ను కున్నాడు.

"మంచి ఆవునే ఏరుకున్నావు," అంటూ ఆ పెద్దమనిషి ఆ ఆవు మెడకు పలుపు కట్టి, దాని చివర కాపు చేతికి అందించాడు.

తరవాత ఆయన తన జేబులోనుంచి ఒక డబ్బీ తీసి, "ఇది నీ భార్యకు నా కానుక. అందులో ఏమున్నదీ ఆమెనే చూసుకోమను—ఆమె ఒంటరిగా ఉన్న ప్పుడే చూడమను సుమా!" అన్నాడు.

కాపు ఆశ్చర్యంతో ఆ డబ్బీని అందు కుంటూ, "తమకు మా మీద ఎందుకింత దయ?" అని అడిగాడు.

పెద్దమనిషి నవ్వి, "నువు ఒకనాడు నా మీద దయతలిచి నాకు రెండు రొట్టెలు



పెట్టావు కోవా? అవును. నేనే ఆ తోడేలును. నేను మంచి వాళ్ళకు మంచివాణ్ణి. చెడ్డ వాళ్ళకు చెడ్డవాణ్ణి. ఇక నువు వెళ్ళు. దేవుడు నీకు మేలు చెయ్యాలి!" అన్నాడు.

ఇది విని కాపుకు ఆనందమూ, ఆశ్చర్యమూ కూడా కలిగాయి. అతను ఆవుతో అడవి దారిని ఇంటికి బయలుదేరాడు.

దారి పొడుగునా కాపు ఆ డబ్బీలో ఏమున్నదో తెలుసుకోవాలని తహతహలాడాడు. దాన్ని తన భార్య ఒంటరిగా ఉన్నప్పుడే తెరవాలని ఆ తోడేలు మనిషి ఎందుకు అన్నాడు? కాపు డబ్బీ పైకి తీసి అటూ, ఇటూ తిప్పి చూశాడు, వాసన చూశాడు. కాని అందులో ఏమున్నదీ అంతు చిక్కలేదు.

తన భార్యకూ తనకూ మధ్య రహస్యాలు లేవు. అందుచేత ఆమె డబ్బీలో ఏమున్నదీ తప్పక చెబుతుంది. ఆ భాగ్యానికి ఇంటికి పోయినదాకా ఆగటం దేనికీ? కాపు డబ్బీ తెరిచి, అందులో ఏమున్నదీ చూడటానికే నిశ్చయించుకున్నాడు.

అతను ఆవును మెయ్యటానికి వదిలి, ఒక చెట్టు కింద కూర్చుని, భద్రంగా డబ్బీ మూత తెరిచాడు. మరుక్షణమే అతను డబ్బీని కింద వదిలేసి, చివాలున లేచి దూరంగా వెళ్ళాడు. ఎందుకంటే డబ్బీలో నుంచి బ్రహ్మాండమైన జ్వాల పైకి వచ్చింది. ఆ జ్వాలకు చెట్టు కొమ్మలు అంటుకున్నాయి.

"అమ్మయ్యో, నా భార్యే ఈ డబ్బీ తెరిచి ఉంటే, దాని జుట్టూ, ముఖమూ కాలిపోయి ఉండేవే! ఆ రాత్రి అంబలితాగుతూ తనను శాపనార్థాలు పెట్టినందుకు తోడేలు మనిషి నా భార్య మీద పగతీర్చుకోవాలని చూశాడు!" అనుకున్నాడు కాపు.

ఇప్పుడు చెట్టు నిలువునా తగలబడుతున్నది. కాపు తన ఆవును తీసుకుని గబగబా ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ నిప్పే అరణ్యంలో చాలా భాగం తన పొట్టన పెట్టుకున్నది. అయితే కాపూ, అతని భార్యా ఆవును పెట్టుకుని చాలాకాలం సుఖంగా బతికారు.





# కష్టఫలి

రామాపురం అనే గ్రామంలో కృష్ణయ్యా, మహబూబ్ అనే వాళ్ళు ఇద్దరు కలిసి ఒక తోట కొన్నారు.

కృష్ణయ్యకు తోటపని కొంచెం కూడా రాదు. అతను అస్తమానమూ భగవంతుణ్ణి ధ్యానిస్తూ ఉండేవాడు.

మహబూబ్‌కు తోటపని బాగా తెలుసు. అతను అస్తమానమూ తోటలోనే పని చేసేవాడు. పిచ్చి మొక్కలు పీకి పారెయ్యటమూ, చెట్లకు పాదులు చెయ్యటమూ, నీరు కట్టటమూ — ఇలాటి పనులలోనే రోజంతా అతనికి గడిచిపోయేది.

ఆ ఏడు తోట బాగా కాసింది. కాయలూ, పళ్ళూ అమ్మగా బోలెడంత డబ్బు వచ్చింది. ఆ డబ్బును భాగస్తులు ఎలా పంచుకోవాలన్న సమస్య కూడా వచ్చింది.

వచ్చిన డబ్బు సమంగా పంచుకునేటందుకు ఇద్దరూ ఒప్పుకోలేదు.

"నేను చచ్చేటట్టు రాత్రిపగళ్ళు చాకిరీ చేయటం వల్ల చెట్లు బాగా కాశాయి. నాకు హెచ్చువాటా రావాలి." అన్నాడు మహబూబ్.

"నేను నిశ్చలమైన మనస్సుతో కూర్చుని దేవుణ్ణి ధ్యానించటం వల్ల దేవుడు అనుగ్రహించి మంచి రాబడి వచ్చేటట్టు చేశాడు. అందుచేత నాకే హెచ్చు వాటా రావాలి." అన్నాడు కృష్ణయ్య.

ఇద్దరూ ఈ విధంగా కొంతసేపు వాదించుకున్న మీదట గ్రామాధికారి వద్దకు వెళ్ళి తమ తగువు తీర్చమన్నారు.

గ్రామాధికారి వారిద్దరి వాదనలూ విని, "నేను మీ ఇద్దరికీ ఒక చిన్న పని పెడతాను. ఈ రాత్రి ఆ పని పూర్తి చేసుకుని రేపు ఉదయం రండి. అప్పుడు నేను మీ వాటాలు ఎలా ఉండాలో చెబుతాను," అన్నాడు.

వి. శ్యామసుందరి

ఆయన వారిద్దరికి చెరో రెండు మూటలూ వడ్లు ఇచ్చి, "వీటిని దంచి బియ్యం చేసుకు రండి," అన్నాడు.

మూటలు తీసుకుని కృష్ణయ్యా, మహబూబూ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

కృష్ణయ్య వడ్లు దంచటానికి ప్రయత్నించక, వడ్లను బియ్యంగా మార్చే భారం భగవంతుడి మీద వేసి, కొంచెం సేపు భగవధ్యానం చేసి, పడుకుని నిద్రపోయాడు.

మహబూబ్ తెల్లవార్లూ మేలుకుని, ఒక మూటెడు వడ్లు దంచి, దాన్ని మాత్రం బియ్యం చెయ్యగలిగాడు.

ఒక రాత్రివేళ గ్రామాధికారి ఇద్దరి ఇళ్ళ మీదుగా వచ్చాడు. కృష్ణయ్య ఇంట వడ్లు దంచుతున్న అలికిడి లేదు. మహబూబ్ ఇంట మాత్రం అలాటి అలికిడి వినిపించింది.

మర్నాడు కృష్ణయ్యా, మహబూబూ మూటలతో గ్రామాధికారి వద్దకు వచ్చారు. గ్రామాధికారి కృష్ణయ్య తెచ్చిన మూటలు రెండూ విప్పి చూస్తే వాటిలో ఒక్క బియ్యపు గింజ కూడా లేదు. దేవుడి అనుగ్రహం వల్ల వడ్లన్నీ బియ్యం అయి ఉంటాయనుకున్న కృష్ణయ్య ఆశ్చర్యపోయాడు.

మహబూబ్ తెచ్చిన రెండు మూటలలో ఒక మూట నిండా బియ్యమూ, రెండో మూట నిండా వడ్లూ ఉన్నాయి.

"చూశావుటయ్యా, కృష్ణయ్యా, పాటు పడనిదే ఫలితం లేదు. నువ్వు దేవుణ్ణి నమ్ముకున్నావు గాని, దేవుడు నిన్ను అనుగ్రహించ లేదు. అనుగ్రహించి ఉంటే నీ చేత పని చేయించి, ఫలితం నీకు దక్కేటట్టు చేసి ఉండేవాడే. తోట మీద వచ్చిన రాబడి పూర్తిగా మహబూబ్ శ్రమ ఫలితమే. నువ్వు కూడా మహబూబ్ తో పాటు కష్టం చేసి ఉంటే ఇంకా హెచ్చు ఆదాయం వచ్చి ఉండేది. ఇకముందైనా ఇద్దరూ కలిసి పని చేసి, రాబడి సమంగా పంచుకోండి," అని గ్రామాధికారి చెప్పాడు.

ఆటు తరవాత కృష్ణయ్య కూడా మహబూబ్ తో కలిసి అన్నిపనులూ చేస్తూవచ్చాడు. ఆదాయం పంచుకునే దగ్గిర వారికి ఎలాటి తగాదాలూ రాలేదు.





# యక్షపర్వతం

## 6

[జడలభూతాన్ని చూస్తూనే బందిపోటుదొంగలు పారిపోసాగారు. వాళ్ళల్లో కొందరు, దొంగిలించుకు వచ్చిన బొన్నకంకుల గోతాలను నదిలో పడవేశారు. ఖడ్గ జీవదత్తులు గుహ ముందుకు రాగానే, జడలభూతం చేసిన హెచ్చరిక విని, మాంత్రికుడు కాగడాలను విసిరివేసి, వాళ్ళిద్దర్నీ భస్మం చేస్తానంటూ గుహ లోపలికి పరిగెత్తాడు. తరవాత—]

ఇప్పుడు తాము గుహలోకి పోయి మాంత్రికుణ్ణి పట్టుకోవటమా లేక అతడు తన మంత్రదండంతో తిరిగి వచ్చేవరకూ గుహ ముందు వేచి వుండటమా అని జీవదత్తుడు ఆలోచిస్తున్నంతలో, ఖడ్గవర్మ గుహ కేసి అనుమానంగా ఓసారి చూసి జీవదత్తుడితో, "జీవా! నీ వేషం ఆ మాంత్రికుణ్ణి కొంచెం హడల కొట్టినట్టున్నది. నీకూ మంత్రతంత్రాలు తెలుసునని అతడు గ్రహించే, హడావిడిగా గుహ లోపలికి పరిగెత్తాడు. యిప్పుడేం చేయుడం?" అన్నాడు.

జీవదత్తుడు తల తిప్పి, ఖడ్గజాతి వాళ్లకు దొరక్కుండా పారిపోయేందుకు జడల భూతం అటూ యిటూ పరిగెత్తుతూ కేకలు పెడుతూవుండటం చూసి చిరునవ్వు నవ్వి, "క్షత్రియుణ్ణో కాదు, మంత్రవిద్యలు నేర్చిన వాణ్ణని నలుగురికీ తెలియుగలందులకే, నేను నెత్తిన శిఖ కట్టి, చేతిలో దండం పట్టు



కున్నాను. కనక ఆ సంగతి మాంత్రికుడు తేలిగ్గానే గ్రహించగలిగాడు. ఇక యిప్పుడు మనం ఏం చేయాలన్నది ముఖ్యసమస్య! మన దారిన మనం పోయే ముందు, యీ మాంత్రికుడి సంగతేమిటో తేల్చుదాం, సరేనా?'' అన్నాడు జీవదత్తుడు.

''అలా అయితే యిక ఆలశ్యమెందుకు? గుహలో జొరబడదాం,'' అంటూ ముందు కదుగు వేశాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు కూడా ఖడ్గవర్మతో పాటు గుహ కేసి నడుస్తూ చుట్టూ ఓ మారు కలయ చూశాడు. ఇప్పుడు ఆ ప్రాంతంలో జడల భూతాన్ని ఎదిరించే బందిపోట్లెవరూ లేరు. గాయపడిన వాళ్ళూ, భూతం దుస్తులకు నిప్పు పెట్టగా శరీరం కాలి, కింద పడి దొర్లుతున్న వాళ్ళూ కొద్ది మంది తప్ప, మిగతా వాళ్ళంతా నది దిగువకు పారి పోయారు. జడల భూతాన్ని మాత్రం ధైర్యంగా ఖడ్గజాతివాళ్ళు ముగ్గురూ చుట్టు ముట్టి ఈటెలతో పొడిచే ప్రయత్నం చేస్తు న్నారు. కాని, భూతం వాళ్ళ దెబ్బలు తప్పుకుంటూ, ''గురో! గురో!'' అని అరుస్తూ గుహ కేసి పరిగెత్తుతున్నది.

''నిజంగా అది భూతమంటావా, లేక మాంత్రికుడు ఎవడో మనిషికి ఆ వికృత వేషం వేసి నాటకం ఆడుతున్నాడంటావా?'' అని అడిగాడు ఖడ్గవర్మ.

''మనిషైనా అలా భూతం లాగా ప్రవ ర్తించటం మొదలు పెట్టాక—దాన్ని భూత మనే మనం అనుకోవాలి. అరె! అది మన ఖడ్గజాతివాళ్ళ నుంచి తప్పించుకుని గుహ ముందుకు పరిగెత్తుతున్నదే!'' అంటూ జీవదత్తుడు భూతాన్ని పట్టుకునేందుకా గుహ కేసి పరిగెత్తసాగాడు.

ఇద్దరూ గుహ దిగువ భాగాన్ని చేరేంతలో జడలభూతం కొండముచ్చులా అక్కడ వున్న బండరాళ్ళ మీది నుంచి గుహ కేసి గబగబా ఎక్కి పోసాగింది. దాన్ని వెంబ డించి వస్తున్న ఖడ్గజాతివాళ్ళు ముగ్గురూ తమ వాహనాల మీద నిలబడి, దాన్ని ఈటె లతో పొడవాలని చూశారు. వాళ్ళల్లో ఒకడు

ఈటెను గురి చేసి భూతం వీపుకు తగిలేలా విసిరాడు. ఈటె వేగంగా పోయి దాని వీపుకు తగిలి, జారి దభీమంటూ కింద పడి, రాళ్ళ మీది నుంచి దిగువకు దొర్లుకు వచ్చింది.

ఖడ్గజాతి వాళ్ళల్లో ఒకడు తానెక్కివున్న ఖడ్గమృగాన్ని దిగి జీవదత్తుడి దగ్గిరకు వచ్చి, "దొరా, పెద్ద పొరపాటు జరిగి పోయింది. మన దగ్గిర బలమైన తాడు ఏదైనా వున్నట్టయితే భూతాన్ని పట్టుకునే పని. మా ఈటె పోట్లు దాని నేమీ గాయ పరిచినట్టు లేదు, శరీరాన్ని నిండుగా కప్పి వున్న జడలు దాన్ని కాపాడినై," అన్నాడు.

"ఈసారి ఆ భూతాన్ని నువ్వన్నట్టు తాడు విసిరి పట్టుకుని బంధిద్దాం! మీరిక్కడే వుండండి. మేము గుహలోకి పోయి, ఆ భూతాన్నీ, దాని యజమాని అయిన మాంత్రికుణ్ణీ అందితే పట్టుకుని, దిగువకు గిరవాటు వేస్తాం," అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడూ, ఖడ్గవర్మా బండరాళ్ళ మీదుగా ఎక్కి పోయి గుహ ద్వారాన్ని సమీపించే సమయానికి కొంచెం ముందు గానే, జడలభూతం అక్కడికి చేరి, "గురో! ఆ ఒంటి కొమ్ము మహిషా లెక్కి వచ్చిన యమకింకరులకు మరిద్దరు మనుషులు తోడయారు. అందరూ మన గుహలోకి వస్తు న్నారు. తొందరగా వాళ్ళను భస్మం చెయ్యండి!" అంటూ కేకలు పెట్టసాగింది.



గుహ లోపలి నుంచి ఎలాంటి జవాబూ రాలేదు. జడలభూతం భయంతో కంపించి పోతూ వెనక్కి తిరిగి చూసింది. దానికి గుహను సమీపిస్తున్న ఖడ్గ జీవదత్తులు కని పించారు. వెంటనే ఒక్క ఎగురు ఎగిరి, కీచుమని పెద్దగా అరిచింది, భూతం.

"ఓ, జడలభూతం, పారిపోకు! మీగురువు గారి గురువులం వస్తున్నాం. అతణ్ణి కూడా బయిటికి రమ్మని కేక వెయ్యి," అంటూ జీవదత్తుడు దండాన్ని ఎత్తి పట్టుకుని భూతం కేసి వేగంగా నడిచాడు. అంతలో గుహ లోపలి నుంచి ఏవో మాటలు వినిపించినై. ఆ వెంటనే భూతం, "చిత్తం, గురో!" అంటూ గుహ లోపలికి పరిగెత్తింది.



''జీవా, ఈ దుర్మార్గులిద్దరికీ మాయమయిపోయే శక్తులేమైనా వున్నవంటావా?'' అన్నాడు ఖడ్గవర్మ ఆశ్చర్యపడుతూ.

''ఊహుఁ, అంత గొప్ప శక్తులు సాధించిన వాళ్ళయితే, బందిపోట్లు దొంగిలించుకు వచ్చిన జొన్నపంటను తాము తిరిగి దొంగిలించుకు పోయేందుకు ఆ మాంత్రికుడూ, వాడి భూతం అంతగా హైరాన పడిపోరు. ఈ గుహనుంచి బయటికి పోయేందుకు మరేదో రహస్య మార్గం వుండి వుంటుంది. జాగ్రత్తగా రాయి రాయినీ కదిపి చూద్దాం,'' అన్నాడు జీవదత్తుడు.

ఆ తరవాత ఖడ్గ జీవదత్తులు గుహ గోడల్లోని ప్రతి ఒక్క రాయినీ బలంగా పట్టుకుని వెనక్కు నెట్టి చూడసాగారు.

ఒక అరగంట కాలం వాళ్ళిలా శ్రమపడిన తరవాత ఒకచోట వున్న నలుచదరపు రాయి ఒకటి కొద్దిగా వెనక్కు కదిలింది. అది నేలకు నాలుగైదడుగుల ఎత్తులో వున్నది.

రాయి కొంచెం కదిలి వెనక్కు జరగగానే జీవదత్తుడు ఖడ్గవర్మను తొందర పడకు అని హెచ్చరించి, చిన్న గొంతుతో, ''ఖడ్గా, మాంత్రికుడూ, వాడి భూతం పారిపోయిన మార్గమేదో తెలుస్తున్నది గదా? వాళ్ళు ఈ రాతిని పక్కకు నెట్టి బయటకు పోయి, తిరిగి దాన్ని ఎప్పటిలా అమర్చారు.

ఖడ్గ జీవదత్తులు మరుక్షణాన గుహ లోపలికి వెళ్ళారు. గుహ మధ్యభాగంలో నాలుగైదడుగుల వెడల్పున్న ఒక గుంటలో నుంచి భగభగమంటూ మంటలు లేస్తున్నవి. దానికి కొంచెం ఎడంగా బాగా నూనెలో తడిపి వున్న కాగడాలు కొన్ని పడివున్నవి. ఆ మంటల వెలుగులో ఖడ్గజీవదత్తులు జడలభూతం కోసం, మాంత్రికుడి కోసం గుహ అంతా వెతికి చూశారు. పదీ పన్నెండడుగుల వెడల్పూ, దాదాపు ఇరవై అడుగుల పొడవూ వున్న ఆ గుహలో మరొక ద్వారం ఎక్కడా వాళ్ళకు కనిపించలేదు. అయితే ఆ గురు శిష్యులు గుహలో ఎక్కడ దాక్కున్నట్టు?

నా అనుమానం వాళ్ళు మనకోసం దాని వెనక వున్న మరో గుహలాంటి దానిలో ఎక్కడో కాచుకుని వుంటారని," అన్నాడు.

"నువ్వనేది మనం రాతిని పక్కకు నెట్టి, అవతలికి దిగబోయే సమయాన, మన మీద వాళ్ళు ఏ కత్తినో, ఈటెనో ప్రయోగిస్తారనేనా?" అని అడిగాడు ఖడ్గవర్మ.

"అవును, అదే నా అనుమానం," అన్నాడు జీవదత్తుడు.

"అప్పుడు నువ్వొక పనిచెయ్యి. ఇద్దరం రాతిని బలంగా పట్టుకుని వెనక్కు నెట్టగానే, నువ్వు కొంచెం పక్కకు తప్పుకో. నేను మండుతున్న కాగడాలను అవతలికి విసిరి, ఏమవుతుందో చూస్తాను. వాళ్ళు మన మీదికి రాకపోతే, ఆ కాగడాల వెలుగులో అక్కడ ఏమున్నదో ముందుగా చూసి, జాగ్రత్తగా అవతలికి దిగవచ్చు. ఏమంటావ్?" అన్నాడు ఖడ్గవర్మ.

"అంత గొప్ప తెలివైన ఉపాయం ఏమీ కాదుగాని—యిప్పటి పరిస్థితిలో అదే వున్న ఒక్క మార్గంగా కనబడుతున్నది," అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు యిలా అనగానే ఖడ్గవర్మ గుహ మధ్య మండుతున్న కొలిమి దగ్గరకు పోయి, ఆ పక్కన పడివున్న కాగడాలు రెండు తీసుకుని, ముట్టించాడు. అవి భగ భగమంటూ మండసాగాయి. ఖడ్గవర్మ



వాటిని తెచ్చి, తాము వెనక్కు నెట్టవలసిన రాయికి దిగువగా నేలమీద ఆనించాడు.

ఖడ్గ జీవదత్తులు కలిసి యీసారి మరింత బలంగా ఒక పట్టు పట్టి నలుచదరపు రాతిని గట్టిగా వెనక్కు నెట్టారు. రాయి చిన్న శబ్దం చేస్తూ కదిలి వెనక్కు పడి పోకుండా, కిటికీ రెక్కలాగా పక్కకు జరిగి నిలబడింది. జీవదత్తుడు పక్కకు తప్పుకున్నాడు. ఖడ్గవర్మ చప్పున వెలుగుతున్న కాగడాలు రెంటినీ కంతలోకుండా అవతలికి విసిరి వేశాడు.

ఒక నిమిష కాలం ఖడ్గజీవదత్తు లిద్దరూ ఊపిరి బిగబట్టి ఏం జరుగుతుందా అని ఆత్రపడుతూ గుహ వారగా నిలబడ్డారు.



అవతలి నుంచి ఎలాంటి శబ్దమూ లేదు. మరొక నిమిషం అలాగే నిలబడి చివరకు ఖడ్గవర్మ పెద్దగా నవ్వి, "జీవా! ఆ దుర్మార్గులు మననుంచి చాలా ఒడుపుగా తప్పించుకు పోవటమేగాక, మనల్ని మూర్ఖుల్ని చేశారు. వాళ్ళు పారిపోయేందుకు అవతల మరేదో గుహామార్గం వున్నదని నాకు తోస్తున్నది," అన్నాడు.

"అంతే కావచ్చు. లేకపోతే మనం ఆ కంత నుంచి ఎప్పుడు కిందికి దిగుతామా అని వాళ్ళు ఆయుధాలతో సిద్ధంగానూ వుండొచ్చు!" అన్నాడు జీవదత్తుడు.

"ఎంతసేపీ జాగ్రత్త? అవతల తెల్లవారబోతున్నది!" అంటూ ఖడ్గవర్మ కత్తి దూసి కంత దగ్గరకు పోయి, అవతలికి తలపెట్టి చూశాడు. అదే సమయంలో జీవదత్తుడు అతడి వెనక నిలబడి ఈటె నొక దాన్ని బలంగా లోపలికి విసిరాడు.

ఖడ్గవర్మకు తాను విసిరి వేసిన కాగడాల వెలుగులో ఒక చిన్న సొరంగ మార్గం తప్ప, మనుషులున్న జాడలే కనిపించలేదు. జీవదత్తుడు కూడా పరీక్షగా చూసి, "ఖడ్గా, యిక మనం ఈ కంతలో నుంచి ఆ సొరంగ మార్గంలోకి దిగవచ్చు. ఆ దుర్మార్గులు అవతల ఎక్కడో దాక్కుని వుంటారు. వాళ్ళు మనకు అనవసరమైన శ్రమ చాలా కలిగించారు. వాళ్ళను ఎలా అయినా సరే వేటాడి తీరవలసిందే!" అంటూ చప్పున సొరంగ మార్గంలోకి దిగాడు. ఖడ్గవర్మ కూడా అతడికి వెనకగా దిగాడు.

ఆ ఇద్దరికీ ఆ ప్రదేశాన రాళ్ళూ రప్పలూ తప్ప మరేం కనబడలేదు. ఖడ్గవర్మ కత్తి దూసి, ఒక కాగడా చేతికి తీసుకుని సొరంగ మార్గం వెంట బయలుదేరాడు. జీవదత్తుడు సొరంగం గోడలను రహస్య ద్వారం ఎక్కడైన వున్నదేమో తెలుసుకునేందుకు మంత్ర దండంతో పొడిచి చూస్తూ, ఖడ్గవర్మను అనుసరించాడు.

వాళ్ళిద్దరూ సొరంగం మార్గాన రెండు మూడు నిమిషాలు నడిచి దాని ముఖప్రదేశాన్ని చేరారు. ఎదురుగా వాళ్ళకు విశాల

మైన బయలు ప్రదేశం. అక్కడ శిథిలావస్థలో వున్న చిన్నా పెద్ద భవనాలూ, వాటి పైన మరింత శిథిలావస్థలో వున్న ఎత్తయిన బురుజూ కనిపించాయి.

జీవదత్తుడు ఆ శిథిల భవనాలను చూస్తూనే ఎక్కడ లేని ఆశ్చర్యంతో, "ఖడ్గా, సూర్యోదయ కాలం సమీపిస్తున్నట్టున్నది. మనం గుహలోనుంచి సొరంగంలో పడి, అక్కడినుంచి ఎలాంటి శిథిల నగరాన్ని చేరామో చూశావా?" అన్నాడు.

"ఇది శిథిల నగరమా? ఏముందిక్కడ, కొద్దిపాటి శిథిలమైన భవనాలు తప్ప?" అన్నాడు ఖడ్గవర్మ.

"ఏమో, ఒకప్పుడిది వే నగరంలోని ముఖ్య భాగమై వుండొచ్చు. మన మాంత్రికుడూ, వాడి జడలభూతం యీ శిథిలాల్లోని ఏదో కలుగులో ఎలుకల్లా దాగి వుంటారు. వాళ్ళను బయటికి లాగటం ఎట్లా?" అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు అనుకున్నట్టు మాంత్రికుడూ, వాడి భూతం అక్కడి శిథిల భవనాల్లోని ఏ నేలమాళిగలోనో దాక్కొని లేరు. వాళ్ళు ఆ భవనాలలోని ఒక పెద్ద మంటపంలో, ఉన్నతాసనం మీద కూర్చుని వున్న ఒక పూజారిణి ముందు మోకరిల్లి వున్నారు. వాళ్ళ పక్కన కొందరు భయంకరాకారులు నిలబడి వున్నారు.




పూజారిణి కళ్ళెర్రచేసి, పళ్ళు పటపట కొరికి, "ఒరే, మాంత్రికభూతాధములారా, యిక లేచి నిలబడండి! మీ యిద్దరి తెలివి తక్కువ వల్ల యీ పవిత్ర నగర రహస్యం కాస్తా నరమానవులకు తెలిసిపోయింది," అన్నది.

"మహాశక్తీ! ఆ మానవులిద్దర్నీ మీ ఆజ్ఞ అయితే యిప్పుడే పట్టి తెచ్చి జడలభూతానికి ఆహారంగా వేస్తాను," అన్నాడు మాంత్రికుడు గడగడ వణికిపోతూ.

పూజారిణి వికటంగా నవ్వి, "ఆహారాన్ని నోటి దగ్గిరకు తెచ్చి పెడితే తప్ప తినలేనంత మందమతి అయిపోయింది, నీ జడలభూతం. మహాభూతం దయవల్ల ఆ మానవులిద్దరూ

మన ప్రయత్నం లేకుండానే, యీ ప్రదేశానికి వచ్చి చేరారు. వాళ్ళెవరో, ఎక్కడి నుంచి వచ్చారో, ఆ వివరాలన్నీ తెలుసుకోకుండా మహాభూతానికి వాళ్ళను బలి చేయటం ప్రమాదం, తెలిసిందా?" అన్నది చేతిలో వున్న శూలాన్ని ఝళిపిస్తూ.

"ఆఁ, తెలిసింది మహాశక్తి, తెలిసింది!" అన్నారు అక్కడ వున్న భృత్యులందరూ ఏకకంఠంగా.

పూజారిణి అందరి కేసీ ఓసారి పరీక్షగా చూసి, "ఇప్పుడు చెప్పేది జాగ్రత్తగా వినండి, శుంఠల్లారా! ఆ మానవులిద్దరికీ ఎలాంటి హానీ కలిగించకుండా పట్టుకుని నా దగ్గిరకు తీసుకు రావాలి. సూర్యోదయం అయింది. వాళ్ళు ఈ శిథిల భవనాల్లో ఎక్కడ ఏమున్నదో చూసేందుకు బయలు దేరతారు. మీలో కొందరు రహస్యంగా వాళ్ళను అనుసరించి వాళ్ళు ఏం మాట్లాడుకుంటారో వినండి. సూర్యుడు నడి నెత్తి మీదికి వచ్చినప్పటి శుభముహూర్త సమయంలో వాళ్ళను నా దగ్గిరకు తీసుకు రావాలి. ఈ లోపల వాళ్ళను స్వేచ్ఛగా తిరగనివ్వండి," అన్నది.

"చిత్తం, మహాశక్తి, చిత్తం!" అంటూ నలుగురు పూజారిణి భృత్యులూ, మాంత్రికుడూ, అతడి జడలభూతం పూజారిణికి నమస్కరించి మంటపం నుంచి బయిటికి వచ్చారు.

"గురో! వెనక నుంచి పోయి మీద పడి, ఆ మానవులిద్దర్నీ విరుచుకు తింటాను. వాళ్ళ కారణంగా మహాశక్తి పూజారిణి వల్ల నేను చాలా మాటలు పడ్డాను," అన్నది జడలభూతం.

"నే నంతకన్న ఎక్కువ అవమానం పాలయాను!" అంటూ మాంత్రికుడు ఒక పొట్టి కత్తిని బలంగా గుప్పెట బిగించి పట్టుకుని, "అదుగో, వాళ్ళు సారంగ ద్వారం ముందు కూర్చుని వున్నారు. మనం యిద్దర్నీ హతం చేసి, అరణ్యంలోకి పారిపోదాం. ఊఁ, పద!" అంటూ చిరుతపులిలా వంగి పొంచి నడుస్తూ ఖడ్గజీవదత్తుల కేసి బయలు దేరాడు.

—(ఇంకా వుంది)





# కీర్తి సాధనం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఏమి సాధించటానికి ఇలా శ్రమపడుతున్నావే గాని, గుణకీర్తి లాగా సాధించిన దాన్ని చేజేతులా ధ్వంసం చేసుకోకు. ఈ లోపుగా నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు గుణకీర్తి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం శోణావతీ తీరాన ఒక గ్రామంలో సదానందుడు అనే వైణికుడు ఉండేవాడు. అయనను అపరసరస్వతి అనీ, అభినవ నారదు డనీ లోకం కీర్తించింది. ఎందరో రాజులు అయనను తమ, ఆస్థానాలకు పిలిచారు. అయితే సదానందుడికి ధనకాంక్ష గాని, కీర్తికాంక్ష గాని లేకపోవటం చేత,

## బేతాళ కథలు

తన విద్యను సాధ్యమైనంత మంది శిష్యు లకు అందించటమే ఆశయంగా పెట్టుకుని జీవించాడు. అనేక వేల శిష్యులు ఆయన వద్ద విద్య నేర్చుకుని, గొప్ప కీర్తి, రాజుల ఆశ్రయమూ కూడా సంపాదించుకున్నారు.

రాను రాను సదానందుడికి వార్ధక్యం వచ్చేసింది. ఆయన తన వద్ద నేర్చుకోవ టానికి వచ్చే కొత్త వారిని తన పాతశిష్యుల వద్దకు పంపుతూ వచ్చాడు.

ఇలా ఉండగా సదానందుడి వద్దకు గుణ కీర్తి అనే కుర్రవాడు వచ్చి, తనకు వీణ నేర్పమని ప్రాధేయపడ్డాడు.

"నాయనా, నేను పెద్ద వాణ్ణి అయి పోయాను. దేశంలో నా శిష్యులు చాలా మంది ఉన్నారు. వారిలో ఎవరి వద్దనన్నా విద్య నేర్చుకో," అన్నాడు సదానందుడు గుణకీర్తితో.

"స్వామీ, మీ శిష్యులలో ఒక్కరు కూడా మీ విద్యను పూర్తిగా సంగ్రహించ లేదు. ఆ పని నేనే చెయ్యాలన్న పట్టుదలతో వచ్చాను. మీ పేరు నిలబెట్టగల నన్న ధైర్యం నా కున్నది," అని గుణకీర్తి అనేక విధాల ప్రాధేయపడ్డాడు.

"నాయనా, నీ ఉత్సాహం గొప్పదే. కాని నీకు పూర్తిగా విద్య చెప్పేదాకా నైనా బతికి ఉంటానా అని నా సందేహం. అయినా, ఎంతో దూరం నుంచి నా కోసం వచ్చావు కనక నీకు వీణ నేర్పుతాను," అంటూ సదా నందుడు గుణకీర్తిని తన శిష్యుడుగా చేర్చుకున్నాడు.



గుణకీర్తి కూడా గురువుగారికి శుశ్రూషలు చేస్తూ, ఎంతో చురుకుగా గురువుగారి అభిప్రాయాలను గ్రహిస్తూ, ఏ శిష్యుడూ నేర్చుకోనంత వేగంగా వీణ నేర్చుకోసాగాడు.

అయినా సదానందుడు భయపడినంతా అయింది. గుణకీర్తి విద్యాభ్యాసం సగం కూడా పూర్తి కాకుండానే సదానందుడు మంచాన పడ్డాడు. ఆయన గుణకీర్తిని దగ్గిరికి పిలిచి, "నాయనా, నాకు కాలం సమీపించింది. నీ విద్య పూర్తి చేసే యోగ్యత నాకు లేదు. నాలుగైదేళ్ళ క్రితం నువు వచ్చి ఉంటే నిన్ను నా కన్న గొప్పవైణికుణ్ణి చేసి ఉందును. కాని ఆ అదృష్టం నీకూ, నాకూ కూడా లేకపోయింది. మా వంశంలో అనాదిగా ఒక చిత్రవీణ ఉన్నది. దాని మీద ప్రతి స్వరమూ మూడు స్థానాలలో పలుకుతుంది. దాని మీద ఒక మాదిరి వైణికుడు వాయించినా శ్రోతలకు ఎంతో అద్భుతంగా వినిపిస్తుంది. ఆ వీణను నీ కిస్తాను. దాని సహాయంతో నువు రాజులను మెప్పించవచ్చు. గొప్ప వైణికుడి వన్న భ్రమకూడా కలిగించవచ్చు." అని చెప్పి, ఆ విచిత్ర వీణను గుణకీర్తికి ఇచ్చి, కన్ను మూశాడు.

గుణకీర్తి గురువుగారికి భక్తితో ఉత్తర క్రియలుచేసి, ఆయన ఉండే కుటీరాన్ని గ్రామాధికారి పరం చేసి, విచిత్ర వీణను తీసుకుని ఆ దేశపు రాజుగారి కొలువుకు వెళ్ళి, తనకు ఆస్థానంలో కొలువు ఇవ్వవలసిందిగా వేడుకున్నాడు.





రాజుగారు సభలో అతనికి కచేరీ చేసే అవకాశం ఇచ్చాడు. గుణకీర్తి తనకు వచ్చిన సంగీతమే విచిత్ర వీణ మీద వాయిస్తూ ఉంటే సభికులు మంత్రముగ్ధులలాగా అయిపోయారు. వారు అలాటి వైణిక వాదనను ఎన్నడూ వినలేదు. రాజు మారు మాట లేకుండా గుణకీర్తిని ఆస్థాన వైణికుడుగా నియమించి, ఎంతో ఆదరించి, అందలా లెక్కించాడు. అతని కీర్తి ప్రతిష్ఠలు అన్ని దిక్కులా వ్యాపించాయి. ఎందరో సమర్థులైన వైణికులు అతని వాయింపు విని, గంధర్వాంశగల వారికి తప్ప అలాటి నైపుణ్యం మానవ మాత్రులకు సాధ్యం కాదన్నారు.

అతని వద్ద శిష్యులుగా చేరుతామని దేశదేశాల నుంచి ఎందరో వచ్చారు. గుణకీర్తి వారిని వారించటానికి రకరకాల సాకులు చెప్పవలిసి వచ్చింది.

లోకం దృష్టిలో గుణకీర్తి గొప్ప ప్రతిభావంతుడు. కీర్తి ప్రతిష్ఠలూ, ధనకనక వస్తు వాహనాలూ కలవాడు. కాని ఒంటరిగా ఉన్నప్పుడు అతను కుంగిపోయి, మానసికంగా భరించరాని అశాంతి పొందేవాడు.

ఇలా ఉండగా ఒకనాడు రాజు గుణకీర్తిని పిలిపించి, "నువు నా కుమార్తె కళావతికి వీణ వాయించటం నేర్పాలి. ఆమె నిన్ను తన కాబోయే భర్తగా వరించింది కూడా," అని చెప్పాడు.

ఈ మాట వినగానే గుణకీర్తి అశాంతి రెట్టింపయింది. అతను మనోవ్యాధితో బాధపడుతున్నవాడిలాగా అయిపోయాడు. అతను ఎందుకు అలా అయిపోతున్నదీ ఎవరికీ తెలియలేదు.

చివరకు ఒకనాటి రాత్రి అతను తన విచిత్ర వీణను తీసుకుని ఎవరికీ తెలియకుండా నదీతీరానికి వెళ్ళి, అక్కడ దాన్ని రాళ్ళకేసి కొట్టి ధ్వంసం చేసి, దాన్ని నదిలో పారేసి, తిన్నగా తనగురువుగారి ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ అతను కొన్నిరోజులుండి, తాను పూర్వం సాధన చేసిన వీణ మీద అహోరాత్రాలు సాధకం చెయ్యసాగాడు.

గురువుగారు లేకపోయినా ఆత్మవిశ్వాసంతో చేసిన అతని సాధన అద్భుతంగా ఫలించ సాగింది.

కొద్ది రోజులలోనే గుణకీర్తి తన పాండిత్యం పరిపూర్ణమయిందని గ్రహిం చాడు. అతను రాజాస్థానానికి తిరిగి వచ్చి తన మామూలు వీణ మీదనే వాయిస్తూ విచిత్ర వీణ మీద వాయించినంత సంగీ తాన్నీ శ్రోతలకు వినిపించాడు.

ఇప్పుడతను కళావతికి వీణవాయించటం నేర్పటమే గాక తన వద్దకు శిష్యులుగా వచ్చినవారి నందరినీ చేర్చుకుని గురుకులం నడిపాడు. కాలక్రమాన రాజు అతనికి తన కుమార్తెనిచ్చి పెళ్ళిచేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, గుణకీర్తి ఎంత వెర్రివాడు! అతను విచిత్ర వీణను ధ్వంసం చెయ్యటం వెర్రిపని కాదా? అతనికి పూర్తి పాండిత్యం అలవడక పోతే ఎంతనష్టం పొందేవాడు! గుణకీర్తి ఇలా ఎందుకు చేశాడు? నీకు తెలిసికూడా చెప్పక పోయావో నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "గుణకీర్తి వెర్రి వాడుకాడు, లక్ష్యశుద్ధిగలవాడు. అతని లక్ష్యం సదానందు డంతటి విద్వాంసుడు కావటం. సదానందుడు మధ్యలో చని పోవటంతో అతని లక్ష్యం సిద్ధించలేదు. అతను పాండిత్యం కోరితే అతనికి దొరికినది విచిత్ర వీణ. ప్రతిభావంతుడు సాధనానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వడు. ప్రతిభకే ప్రాముఖ్యం ఇస్తాడు. సాధనానికి ప్రాముఖ్యం ఉండటం గుణకీర్తి అశాంతికి కారణం. లక్ష్యసిద్ధికి అంతరాయంగా ఉంది. తన అశాంతికి కారణ భూతమైన విచిత్ర వీణను పగలగొట్టటం అతనికి తప్పనిసరి అయింది. ఆత్మవిశ్వాసంతో అతను ఏక లవ్యుడి లాగా తన గురువును మనసులో పెట్టుకుని, తన పాండిత్యాన్ని పూర్తి చేసు కున్నాడు. అది పూర్తికాకపోతే అతను బాధపడి ఉండడనుకోవాలి," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# మూడు తుమ్ములు

మూఢమతి అనేవాడు ఒక కట్టెలుకొట్టేవాడి కొడుకు. తండ్రి చనిపోయాక కట్టెలు కొట్టే పని మూఢమతి పైనపడింది. వాడు గాడిదను తోలుకుని అడవికి వెళ్ళి, ఒక చెట్టెక్కి, తాను కూర్చున్న కొమ్మనే కొట్టసాగాడు.

దారే పోయే పెద్దమనిషి ఒకడు, "ఆ కొమ్మ కొట్టకు. కింద పడిపోగలవు," అన్నాడు. మూఢమతి లక్ష్యపెట్టక, ఆ కొమ్మనే కొట్టి, దానితోబాటు కిందపడ్డాడు.

జరగబోయేది సరిగా చెప్పిన ఆ మనిషి గొప్ప దైవజ్ఞుడనుకుని మూఢమతి, పరిగెత్తి వెళ్ళి ఆ మనిషిని కలుసుకుని, "అయ్యా, నే నెప్పుడు చచ్చిపోతాను?" అని అడిగాడు.

వాడు మూఢుడని గ్రహించి ఆ మనిషి, "నీ గాడిద మూడు తుమ్ములు తుమ్మగానే పోతావు," అని తన దారిన వెళ్ళిపోయాడు.

తరవాత మూఢమతి గాడిదను తోలుకుని ఇంటికి వస్తుంటే ఒక చోట చెత్తకుప్ప తగల బడుతున్నది. ఆ పొగ ముక్కుల్లోకిపోయి గాడిద తుమ్మింది. మూఢమతి భయపడి దాని ముక్కులకు తన తలమీది బట్ట చుట్టాడు. ఊపిరాడక గాడిద మళ్ళీ తుమ్మింది. మూఢమతి మరింత భయపడి దాని ముక్కులలో రాళ్ళు పెట్టాడు. ఆ కారణంగా గాడిద మరింత గట్టిగా తుమ్మింది.

మూఢమతి భయంతో మూర్ఛపోయాడు. దారే పోయేవాళ్ళు ముఖాన నీళ్ళు చల్లి వాడికి స్పృహతెప్పించారు. వాడు కళ్ళు తెరిచి, "ఇది స్వర్గమా? నరకమా?" అని అడిగాడు. వాడి కథ విని అందరూ నవ్వారు.

—సి. వి. ఎస్. నాయుడు





# ఎత్తుకుపై ఎత్తు

ఒక గ్రామంలో సాంబయ్య అనే వాడు ఉండేవాడు. అతను తప్పుడు సాక్ష్యాలు చెప్పి అదే వృత్తిగా బతికేవాడు, ఇంకే పనీ చేసేవాడు కాదు. తప్పుడు సాక్ష్యాలు చెప్పి డబ్బు గడించే అవకాశం లేనప్పుడు తానే గ్రామస్థుల మధ్య తగాదాలను ఎగదోసి, ఎవరు ఎక్కువ డబ్బు ఇస్తే వారిపక్షాన సాక్ష్యం చెప్పేవాడు.

కొంత కాలానికి సాంబయ్య ధోరణి అందరికీ తెలిసిపోవటం చేత గ్రామపెద్దలు అతని సాక్ష్యాన్ని ఆమోదించటం మానుకున్నారు. అప్పుడు సాంబయ్య తన వృత్తిని దూర గ్రామాలలో కొనసాగించటానికి బయలుదేరాడు.

అతను వెళ్ళే దారిలో ఒక శెట్టి నెత్తిన నేతి డబ్బా పెట్టుకుని పోతూ ముందు కనిపించాడు. సాంబయ్యకు వెనకగా ఒక కూలీలాటివాడు నడుస్తున్నాడు. ఆ ఇద్దరినీ చూడగానే సాంబయ్యకు ఒక ఆలోచన వచ్చింది. అతను ఆగి, కూలివాణ్ణి దగ్గిరికి రానిచ్చి, "నే నొక ఉపాయం చెబుతాను, చేస్తావా?" అన్నాడు.

"లాభించేటట్టుంటే చేస్తాను," అన్నాడు కూలివాడు.

"నెత్తిన నేతి డబ్బా పెట్టుకుని ముందు వెళుతున్న శెట్టిని చూశావా? నువు ఆ డబ్బా నీదేనని చెప్పి లాగేసుకో. శెట్టి నీ మీద ఫిర్యాదు చేస్తే నేను నీ పక్షాన సాక్ష్యం చెబుతాను. సాక్ష్యం చెప్పినందుకు నాకు రెండు రూపాయలియ్యాలి. నాకు రెండు రూపాయలు లాభం, నీకు నేతి డబ్బా లాభం. ఏమంటావు?" అన్నాడు సాంబయ్య.

ఈ ఉపాయం కూలివాడికి నచ్చింది. వాడు గబగబా నడిచి వెళ్ళి, శెట్టి నెత్తిమీది నేతి డబ్బా లాగేసుకుని, "ఇది నా డబ్బా," అన్నాడు.

బూర్లె నాగేశ్వరరావు

"ఇది అన్యాయం. నేను ఈ పక్క గ్రామానికి వెళ్ళి నీ మీద ఫిర్యాదు చేస్తాను," అన్నాడు శెట్టి కూలివాడితో.

"పద, నేనూ వస్తాను. ఈ డబ్బా నాదే నని నేను న్యాయస్థానంలో నిరూపించుకో గలను," అన్నాడు కూలివాడు.

ఇద్దరూ కలిసి పక్క గ్రామంలో న్యాయాధికారి దగ్గిరికి వెళ్లారు. వారి వెనకనే సాంబయ్య కూడా వెళ్ళాడు.

ఇద్దరు చెప్పినదీ విని న్యాయాధికారి, "మీ ఇద్దరిలో ఎవరు నిజం చెబుతున్నదీ తెలియటం లేదు," అన్నాడు.

దానికి కూలివాడు, "పిల్లలుగల వాణ్ణి, అబద్ధమాడుతానాండీ? ముందు గ్రామంలో ఉన్న నా కూతురు ఇంటికి ఈ నెయ్యి పట్టుకు పోతూంటే, ఈ శెట్టి దారిలో కలిసి డబ్బా లాక్కో బోయ్యాడు. అందుకని మీ వద్దకు లాక్కొచ్చాను," అన్నాడు.

"నువు చెప్పేది కళ్ళారా చూసిన వాళ్ళె వరన్నా ఉన్నారా?" అని న్యాయాధికారి కూలివాణ్ణి అడిగాడు.

"ఉన్నాడండీ. ఎవరో అయన మాతో బాటు నడుస్తూ వచ్చాడు. ఒక్కనిమిషం ఉండండి," అని కూలివాడు వీధిలోకి వచ్చి, సాంబయ్యను లోపలికి తీసుకుపోయాడు.

న్యాయాధికారి సాంబయ్యను, "ఈ మనుషులు నీకు తెలుసా?" అని అడిగాడు.

"నాకు తెలీదండి. నేను వచ్చేదారిలో వీళ్ళు తగూపడటం మటుకు చూశాను." అన్నాడు సాంబయ్య.



"అలా అయితే చెప్పు. ఈ డబ్బా ఎవరిది? ఎవరినుంచి ఎవరు దీన్ని కాజేశారు?" అని న్యాయాధికారి సాంబయ్యను అడిగాడు.

"ఈ కూలిమనిషి నేతి డబ్బా తెస్తుంటే, ఈ శెట్టిగారు దాన్ని లాక్కోబోవటం కళ్ళారా చూశాను," అన్నాడు సాంబయ్య.

సాంబయ్య చెప్పిన సాక్ష్యం అధారంగా న్యాయాధికారి నేతి డబ్బాను కూలివాడికి ఇప్పించాడు.

న్యాయాధికారి తీర్పు ప్రకారం కూలి వాడు నేతి డబ్బా తీసుకుని సాంబయ్య చేతిలో రెండు రూపాయలు పెట్టాడు. తిరిగి ముగ్గురూ దారి పట్టారు. ముందు కూలి నడుస్తున్నాడు. వెనకగా సాంబయ్యా, అతని వెనకగా శెట్టీ నడుస్తున్నారు.

సాంబయ్య చేసిన దుర్మార్గం శెట్టికి అర్థమయింది. సాంబయ్యను మోసగించి తన నేతి డబ్బా తిరిగి సంపాదించుకోవాలని శెట్టి నిశ్చయించుకున్నాడు.

అతను సాంబయ్యను కలుసుకుని వెంట నడుస్తూ "ఏమయ్యా, నువు నాకంటె తెలివిగల వాడవనుకున్నాను. నీకన్న ఆకూలి చేసుకునేవాడే నయమే. నీ చేతిలో రెండు రూపాయలు పెట్టి ఇరవై రూపాయల నేతి డబ్బా కాజేశాడు," అన్నాడు.

ఈ మాట విని సాంబయ్య తెల్లమొహం వేశాడు.

మళ్ళీ శెట్టి ఇలా అన్నాడు:

"నువు చేసినపనే నేనూ చేసి ఈ నేతి డబ్బా సంపాదించాను. నేతి దుకాణంలో



ఈ డబ్బాను ఒకడు బేరం చేశాడు. ఆ మనిషి దుకాణం వాడికి డబ్బు ఇవ్వబోతూంటే, వద్దని సంజ్ఞ చేశాను. అది గ్రహించి ఆ మనిషి దుకాణం వాడితో డబ్బు ముందే ఇచ్చేశా నన్నాడు. దుకాణం వాడు లేదన్నాడు. ఇద్దరూ గొడవపడ్డారు. జనం మూగారు. అప్పుడు నేను కల్పించుకుని దుకాణం వాడితో, 'నీకు బుద్ధి లేదుటయ్యా? ఆ మనిషి డబ్బు ఇస్తుండగా నేను చూశాను,' అన్నాను. నలుగురూ దుకాణం వాణ్ణి మందలించి, నేతి డబ్బా ఆ మనిషికి ఇప్పించారు. అతను డబ్బాతో తన గ్రామానికి బయుదేరుతూంటే నేను వెంటపడ్డాను. ఆ మనిషి నా చేతిలో రెండు రూపాయలు పెట్టబోయాడు. నేనేమన్నా వెర్రివాణ్ణా? అదేమీ కుదరదని చెప్పి, ఆ మనిషి చేతిలో నేనే రెండు రూపాయలుపెట్టి డబ్బా తీసేసుకున్నాను. నువూ అదేపని చేశావుగాని, నా లాగా తెలివితేటలూ, అంతకన్న మంచినేర్పూ ఉపయోగించి డబ్బా సంపాదించుకో లేక పోయావు. నీ తెలివి అలా ఉంది."

శెట్టి ఈ మాట అనగానే సాంబయ్యకు ఆశపుట్టింది.

"ఇప్పుడేం చెయ్యాలి?" అన్నాడతను శెట్టితో.

"కూలివాడు నన్ను ఏం చేశాడో అదే ఇప్పుడు నువు చెయ్యి. నీకు నేను అండ ఉంటాను. నా సహాయానికి ఏదో ముట్ట జెప్పుదువు గాని!" అన్నాడు శెట్టి.

సాంబయ్య గబగబా నడిచివెళ్ళి కూలి వాడి దారికి అడ్డంగా నిలుచుని, "నాడబ్బా చాలా దూరం మోశావు. ఇంక నాకు ఇచ్చెయ్యి," అన్నాడు.

కూలివాడు, "నీ సాక్ష్యానికి డబ్బు ఇచ్చు కున్నానుగా. పదపద!" అన్నాడు.

సాంబయ్య బలాత్కారంగా డబ్బా లాక్కోబోయాడు. కూలివాడు డబ్బా కింద పెట్టి, సాంబయ్య మీద కలియబడ్డాడు. ఇద్దరూ ఘోరంగా కొట్టుకున్నారు. ఇద్దరూ సగంచచ్చి పోట్లాట విరమించే సరికి శెట్టి గాని, నేతిడబ్బాగాని కనుచూపు మేరలో ఎక్కడా కనిపించ లేదు.



# మహాకవి - మామిడిపళ్లు

గాలిబ్ మహాకవికి మామిడిపళ్ళంటే చాలా ఇష్టం. ఆయన చాలా చమత్కారంగా మాట్లాడ గలవాడు కూడానూ.

ఒకనాడు సాయంత్రం గాలిబ్ సుల్తానుగారి వెంట మామిడితోటకు వెళ్ళాడు. చెట్ల నిండా పళ్ళున్నాయి.

గాలిబ్ ప్రతిచెట్టునూ పరిశీలనగా చూస్తూ ఉండటం గమనించి సుల్తాను, "ఆ చెట్ల కేసి ఎందు కలా చూస్తున్నారు?" అని అడిగాడు.

"నా తండ్రి తాతల పేర్లు ఏ చెట్లమీదనన్నా కనిపిస్తాయేమోనని చూస్తున్నాను," అన్నాడు గాలిబ్. చెట్లు తన తండ్రి తాతలవైతే వాటి పళ్ళు తనవి అవుతాయని గాలిబ్ చమత్కృతి. అది గ్రహించి సుల్తాను మామిడిపళ్ళు కోయించి, బుట్టలకు ఎత్తించి గాలిబ్ ఇంటికి పంపాడు.

ఒకనాడు గాలిబ్ తన ఇంటి ముందు కూర్చుని మామిడిపళ్ళు తింటూ, టెంకలు బయట పారేస్తున్నాడు. ఆ సమయంలో గాలిబ్ వద్దకు మామిడిపళ్ళు నయించని మిత్రు డొకడు వచ్చాడు. అంతలో ఒక గాడిద వీధి వెంట పోతూ మామిడిటెంకను వాసన చూసి, తినకుండా వెళ్ళిపోయింది. "చూచావా, గాలిబ్? మామిడిపళ్ళను గాడిదలు కూడా ముట్టవు," అన్నాడు స్నేహితుడు.

"అవును, గాడిదలకు మామిడిపళ్ళు నయించవు!" అన్నాడు గాలిబ్ ఛలోక్తిగా.

—జి. పాపిరెడ్డి






# ఒకరోజురాజు

## 4

గాయాలు నిమ్మళించిన మీదట అబూ అల్ హసన్‌కు ఇంట్లో కూర్చోవటం విసుగు అనిపించింది. అతను పూర్వంలాగే సూర్యాస్తమయం వేళ వంతెన చివర కూర్చుని, అపరిచితులైన ఆగంతుకుల కోసం చూడసాగాడు.

అతను వంతెన వద్దకు వెళ్ళిన మొదటి రోజే ఖలీఫా మారువేషంలో సంచారం చేసి తిరిగి వచ్చే రోజు. అందుచేత హసన్ తల ఎత్తి నగరంలోకి వస్తున్న మనుషులను చూసేసరికి, అతనికి మోసల్ వర్తకుడూ, ఆయన వెనక మహాకాయుడైన బానిసా కనిపించారు.

ఒకసారి పరిచయం అయిన వారిని మళ్ళీ పలకరించే అలవాటు లేని కారణం చేత హసన్ వారి మీది నుంచి దృష్టి మళ్ళించి, వంతెన మీదుగా నది కేసి చూడసాగాడు.

కాని ఖలీఫా అతనిని వదిలిపెట్ట దలచ లేదు. అతని ద్వారా తనకు ఎంతో ఆనందం కలిగింది. అదీగాక, ఇంటికి తిరిగి వచ్చినాక అతనికి కలిగిన కష్టాలను గురించీ, పిచ్చివాడని చెప్పి అతన్ని ఉన్మాదశాల వాళ్ళు పెట్టిన బాధలను గురించీ ఖలీఫా ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే వచ్చాడు. అందుచేత ఆయన హసన్‌ను ఏదో విధంగా బహూకరించటానికి నిశ్చయించుకున్నాడు.

ఖలీఫా హసన్‌ను సమీపించి, అతని భుజం మీద గడ్డం ఆనించి, "మిత్రమా, అబూ అల్ హసన్, క్షేమంగా ఉన్నావా? నిన్ను కౌగలించుకోవాలని ఆత్రంగా ఉన్నది," అన్నాడు.

హసన్ నది మీది నుంచి తన దృష్టి మళ్ళించక, "నిన్ను నేను ఎరగను. పద, పద!" అన్నాడు.

"అదేమిటి, హసన్? నీ అతిథినే మరి చావా?" అని ఖలీఫా అన్నాడు.

"అల్లా సాక్షిగా నేను నిన్ను ఎరగను. నీ దారిన నువు వెళ్ళు," అన్నాడు హసన్.

"నేను నిన్ను సులువుగా గుర్తించానే! మనం నీ యింట సరదాగా గడిపి నెలే కదా అయింది? నువు నన్ను గుర్తు పట్టలేదంటే నేను ఎలా నమ్మను?" అన్నాడు ఖలీఫా.

హసన్ ఈసారి జవాబు కూడా చెప్పక, వెళ్ళమని చేతితో సైగ చేశాడు. ఖలీఫా హసన్ మెడ చుట్టూ చేతులు వేసి, "నీ ధోరణి ఏమీ బాగా లేదు. నన్ను మరొకసారి మీ ఇంటికి తీసుకుపోయి నీకు నా మీద ఎందుకు కోపం వచ్చిందో చెప్పిన దాకా నిన్ను విడవను. నీ వాలకం చూస్తే నేనంటే నీ కేదో గుర్రు ఉన్నట్టు కనబడుతున్నది," అన్నాడు.

అబూ అల్ హసన్ పట్టరాని కోపంతో, "పాపిష్టి ముఖమా! నాకు అన్ని కష్టాలు తెచ్చి పెట్టి మళ్ళీ నాకు అతిథిగా వస్తానని ఎలా అడుగుతున్నావు? నీ ముఖం నాకు చూపించకు," అని గట్టిగా అరిచాడు.

ఖలీఫా హసన్‌ను కౌగలించుకుని, "మిత్రమా, హసన్, నా మీద అంత కోపమా? నా రాకవల్ల నీకేమైనా కష్టం కలిగి ఉంటే అది బుద్ధిపూర్వకంగా నేను చేసినది కాదని నమ్ము. నీకు కలిగిన ఇబ్బంది ఏదో చెబితే



దానికి ప్రతిక్రియ చేయటానికి నేను సిద్ధంగా ఉన్నాను," అన్నాడు, హసన్ పక్కనే తాను కూడా వంతెన మీద కూర్చుని, అతని భుజం మీదుగా చెయ్యివేసి.

ఈ మాటలకూ, చేతలకూ హసన్ మెత్తబడి, "ఆ రాత్రి నువు తలుపు మూయకుండా వెళ్ళిన అనంతరం జరిగిన విడ్డూరాలూ, వాటి ఫలితంగా నాకు కలిగిన ఇక్కట్లూ నీకు చెబుతాను," అంటూ జరిగినదంతా పూస గుచ్చినట్టు వివరంగా చెప్పాడు. అతను తనకు ఖలీఫా భవనంలో జరిగిన అనుభవమంతా ఏదో గాలిచేష్ట అన్నట్టు మాట్లాడుతుంటే ఖలీఫాకు నవ్వు ఆగలేదు.



అది చూసి హసన్, "నా బాధలు నీకు వేళాకోళంగా ఉన్నాయా, లేక నేను కట్టు కథలు చెబుతున్నాననుకుంటున్నావా? నా మాట నమ్మకపోతే ఈ కొరడా దెబ్బల వాతలు చూడు," అంటూ చొక్కా విప్పి, చేతులమీదా, వీపునాగల మచ్చలు చూపాడు.

వాటిని చూసి ఖలీఫాకు కన్నీరు వచ్చినంత పని అయింది. ఆయన హసన్‌ను ప్రేమగా కౌగలించుకుని, "తమ్ముడూ, నన్ను ఈ రాత్రికి మళ్ళీ మీ ఇంటికి అతిథిగా తీసుకుపో. నీ అతిథ్యం కోసం ఎంతో ఉబలాటంగా ఉన్నది. ఇందుకు గాను రేపు నీకు అల్లా పదివేల రెట్లు మేలు చేస్తాడు చూసుకో!" అని ఎంతగానో బతిమాలాడు.

ఒకే మనిషికి రెండుసార్లు అతిథ్యం ఇవ్వరాదన్న నియమాన్ని హసన్ భంగం చెయ్యక తప్పలేదు. అతను ఖలీఫాను తన ఇంటికి తీసుకుపోతూ, "నేను నిన్ను తప్పనిసరి అయి అతిథిగా తీసుకుపోతున్నాను. నాది ఒకటే ప్రార్థన: తలుపు మూయటం మరవవద్దు," అన్నాడు.

ఖలీఫా అలాగేనంటూ బలవంతాన నవ్వు ఆపుకున్నాడు.

ఇద్దరూ హసన్ ఇంట్లో ప్రవేశించినాక ఒక బానిస వారికి భోజనం వడ్డించి, తాగుడు అందించాడు. ఇద్దరూ తాగుతూ మాట్లాడుకునేటప్పుడు ఖలీఫా అకస్మాత్తుగా, "నిన్ను స్త్రీలు ఎప్పుడన్నా ఆకర్షించారా? నీకు పెళ్ళి మీద మనసుపోలేదా?" అని అడిగాడు.

దానికి హసన్, "నాకు మిత్రులంటేనే సరదా. మంచి భోజనమూ, తాగుడూ, సరసంగా సంభాషణలూ ఉంటే నాకు ఇంకేమీ అక్కర్లేదు. నాకు స్త్రీలంటే ఇష్టం లేదని కాదు. నాకు సైతాను ఆ వింత కలలో చూపించిన ఆడపిల్లల వంటి వాళ్ళు, ఎప్పుడూ నవ్వుతూ, ఆడుతూ, పాడుతూ, అవతల వాళ్ళ అవసరాలు గమనించి, వాటిని తీర్చుతూ ఉండే వాళ్ళంటే అలాటి స్త్రీని ఒకతెను డబ్బుకైనా కొని, పెళ్ళాడి ప్రేమించగలను. కాని అలాటి ఆడపిల్లలు

ఏ ఖలీఫా అంతఃపురంలోనో, వజీరు జఫర్ అంతఃపురంలోనో ఉంటారు. అందుచేత నేను అలాటి ఆశలు పెట్టుకో లేదు. మామూలు స్త్రీల ముక్కు విరుపులూ, మూతి విరుపులూ భరించేకన్న ఒంటరిగా ఉంటూ, స్నేహితుల సాంగత్యంలో ఆనందం పొందటమే నాకు ఇష్టం," అన్నాడు.

ఇలా అంటూ హసన్ ఖలీఫా అందించిన లోటా తీసుకుని, తాగి స్పృహ తప్పి పడి పోయాడు. ఖలీఫా మళ్ళీ అతని తాగుడులో మత్తుమందు కలిపాడు.

ఖలీఫా సైగ చెయ్యగానే ఆయన వెంట ఉన్న బానిస హసన్‌ను మోసుకుని బయలు దేరాడు. వాడి వెనకగా ఖలీఫా బయటికి వచ్చి, ఈ సారి వాకిలి జాగ్రత్తగా మూశాడు. ఏమంటే, ఈ సారి హసన్‌ను ఇంటికి తిప్పి పంపే ఉద్దేశం ఆయనకు లేదు.

ఖలీఫా, హసన్‌ను మోస్తున్న బానిసా రహస్యద్వారం కుండా రాజభవనం ప్రవే శించి, ఖలీఫా మందిరం చేరుకున్నారు. కిందటిసారిలాగే, ఖలీఫా హసన్‌కు తన ఉడుపులు తొడిగించి, తన పాన్పు మీద పడుకోబెట్టించాడు. ఆయన మస్రూర్‌ను పిలిచి, ప్రార్థనల వేళకు ముందుగానే తనను లేపమని చెప్పి, తాను పక్క గదిలో పడుకుని నిద్రపోయాడు.




మర్నాడు ఉదయం మస్రూర్ వచ్చి ఖలీఫాను సకాలంలో నిద్రలేపాడు. ఖలీఫా హసన్ పడుకుని ఉన్న చోటికి వెళ్ళాడు. హసన్ మత్తులో ఒళ్ళు తెలియకుండా నిద్ర పోతున్నాడు. కిందటిసారి హసన్ ఏయే గదులలో ఏయే యువతులను చూసి ఉన్నాడో వారినందరినీ ఖలీఫా రప్పించాడు. ఆయన వాద్యాల వాళ్ళనూ, పాడే వాళ్ళనూ కూడా పిలిపించి, అందరినీ వారి వారి స్థానాలలో పెట్టాడు. వారు ఏమేం చెయ్యాలో చెప్పి, హసన్‌కు ద్రావకం వాసన చూపించ మని, తాను వెళ్ళి దాక్కున్నాడు.

ద్రావకం వాసన తగలగానే హసన్‌కు మత్తు వదిలింది. అదే సమయంలో దివ్య

మైన గానం ప్రారంభమయింది. కొద్ది క్షణాల పాటు హసన్ కళ్ళు మూసుకునే ఆ సంగీతం విని, తరవాత కళ్ళు తెరిచి చుట్టూ కలియజూశాడు. తాను పూర్వం చూసిన గదే! అదే పక్క. అవే అలంకరణలూ, నగిషీలూ! అంతకన్నా చిత్రం ఏమంటే, తన చుట్టూ అదే అమ్మాయిలు! అతడు లేచి కూర్చుని, కళ్ళు గట్టిగా నులుపుకున్నాడు.

పాట నిలిచిపోయి, గది నిశ్శబ్దమయింది. హసన్ తమకేసి చూడగానే ఆడవాళ్ళ కళ్ళు వాలిపోయాయి.

హసన్ ఆవేశంతో, "నీకు మళ్ళీ మూడిందిరా, హసన్, నా తల్లి కొడకా! ఇవాళ ఈ భ్రమా, రేపు కొరడా దెబ్బలూ, గొలుసులూ, చీకటి కొట్టానూ! ఒరే మోసల్ వర్తకుడా, నువు మళ్ళీ తలుపు మూయకుండా వెళ్ళావురా! నిన్ను నరకంలో కండలు కొయ్యా! మోసల్ వర్తకులంతా నాశనం కానూ! మోసల్ నగరం మట్టిలో కలిసిపోనూ!" అని అరిచి, భ్రమ తొలిగిపోతుందేమోనని కళ్ళు చాలాసార్లు మూసి తెరిచాడు. తరవాత అతను తనతో తను, "ఒరే దౌర్భాగ్యుడా! మళ్ళీ పడుకుని నిద్రపో. సైతాను వదిలినదాకా లేవకు. ఈ ఆడపిల్లల కేసి చూశావంటే రేపు నీ గతి ఏమవుతుందో జ్ఞాపకం ఉంచుకో." అని చెప్పుకుని, దుప్పటి నిండా ముసుగుతన్ని, తాను నిద్రపోతున్నట్టు తనకు నమ్మకం కలగటానికి గురక కూడా పెట్టసాగాడు.



ఇదంతా తెర వెనక నుంచి చూస్తున్న ఖలీఫాకు నవ్వుతో ఉక్కిరి బిక్కిరి అయింది.

కాని హసన్ ఎలా నిద్రపోగలడు? అతనికి ఎంతో ఇష్టమైన గన్నా అనే పిల్ల అతని పక్కనే వచ్చి కూర్చుని, "ఏలిన వారు చిత్తగించాలి. ఉదయ ప్రార్థనలకు వేళ అవుతున్నది," అన్నది.

హసన్ దుప్పటి లోపలినుంచి, "ఫో, సైతాన్!" అని రంకెపెట్టాడు.

"ఏలిన వారికి ఏదో పీడ కల వచ్చినట్టున్నది. నేను సైతానును కాను, గన్నాను!" అన్నదామె.

హసన్ దుప్పటి ముఖం మీది నుంచి తీసి, కళ్ళు తెరిచి చూశాడు. గన్నా పక్క మీద కూర్చుని ఉన్నది. మిగిలిన ఆడ వాళ్ళందరూ మూడు వరసలలో నిలబడి ఉన్నారు: వాళ్ళందరి పేర్లూ హసన్ ఎరుగును.

"మీ రెవరు? నేనెవరిని?" అని అతను వాళ్ళను అడిగాడు.

అందరూ ఏక కంఠంగా, "మీరు మా ప్రభువు హారూనల్ రషీద్!" అని జవాబిచ్చారు.

"మీరందరూ కలిసికట్టుగా అబద్ధం ఆడుతున్నారు! నేను అబూ అల్ హసన్‌ను కానా?" అని అతను మళ్ళీ అడిగాడు.

"పాపం శమించాలి. మీరు అబూ అల్ హసన్ కానేకాదు. మా ఏలిక, మా ప్రభువు!" అన్నారు అందరూ ఒక్కసారిగా.



అతను గన్నా కేసి తిరిగి, "ఎందుకైనా మంచిది. నా చెవి కొరుకు," అన్నాడు.

గన్నా అతని చెవి గట్టిగా కొరికింది. హసన్ పెద్దగా ఆర్తనాదం చేసి, "నేను హారూనల్ రషీద్‌నే!" అన్నాడు.

మళ్ళీ సంగీతం మొదలయింది. ఆడపిల్లలు చేతులూ చేతులూ కలుపుకుని హసన్ పడుకున్న మంచం చుట్టూ నృత్యం చెయ్యసాగారు. హసన్ ఆనందం పట్టలేక, దుప్పటి ఒకవేపూ, దిళ్ళు మరొకవేపూ గిరవాటు వేసి, వాళ్ళతో కలిసి నృత్యం చెయ్యసాగాడు.

ఖలీఫా నవ్వు ఆపుకోలేక కప్పు ఎగిరిపోయేటట్టు అట్టహాసం చేస్తూ తెర ఇవతలికి వచ్చి, "చంపేస్తున్నావురా, హసన్," అన్నాడు.

ఒక్కసారిగా నృత్యం ఆగిపోయింది. ఆడపిల్లలు బొమ్మలలాగా ఎక్కడివారక్కడ కొయ్యబారి నిలబడిపోయారు. నిశ్శబ్దం ఏర్పడింది. అందరితోబాటు హసన్ కూడా నిలిచిపోయాడు. అతను ఖలీఫాను చూస్తూనే మోసల్ వర్తకుడని తెలుసుకున్నాడు. మెరుపు మెరిసినట్టుగా అతనికి అంతా అర్థమైపోయింది.

తనను పెట్టి ఖలీఫా ఆడిన ప్రహసనం గ్రహించి కూడా హసన్, తన ఎదురుగా ఉన్నది ఖలీఫా అన్న సంగతి తెలియనట్టు నటిస్తూ, ధైర్యంగా ఆయనమీదికి వెళ్ళుతూ, "తలుపులు మూయనందుకు ఏం చేస్తానో తెలుసా, మోసల్ వర్తకుడా?" అన్నాడు.

ఖలీఫా గట్టిగా నవ్వి, హసన్‌ను కౌగలించుకుంటూ, "తమ్ముడూ, నువు పడ్డ కష్టాలకుగాను నీకు గల గొప్ప కోరిక తీర్చి, నిన్ను నా బంధువర్గంలో చేర్చుకుంటాను," అన్నాడు.

తరవాత ఆయన తన దుస్తులలో అమూల్యమైనవి ఏరి హసన్‌కు కట్టబెట్టి, "కోరుకో. నువు కోరినదల్లా ఇస్తాను," అన్నాడు.

హసన్ ఖలీఫాకు వందనంచేసి, "బతికినంత కాలమూ ఏలినవారి నీడన తలదాచుకోగలిగితే నా కదేచాలు," అన్నాడు.

—(ముగింపు వచ్చే సంచికలో)



# పనికిమాలినవాడు

పూర్వం కళింగదేశాన్ని పాలించిన ధీరసింహుడికి భయంకరమైన చర్మవ్యాధి సోకింది. అది ఎన్ని చికిత్సలకూ లొంగక పెరిగిపోతూ వచ్చింది. అప్పుడు రాజవైద్యుడు, "మహారాజా, దీనికి సాటిలేని చికిత్స ఒకటే ఉంది. అదేమిటంటే, ఎందుకూ పనికిరాని వాడి రక్తం మీ శరీరం అంతటా పూయటం. అలా చేస్తే తప్ప ఈ వ్యాధి నివారణ కాదు," అన్నాడు.

రాజభటులు దేశంమీదపడి ఎందుకూ పనికిరాని ఒక వ్యక్తిని సంపాదించారు. వాడి పేరు అష్టవక్రుడు. ఏపని చెయ్యటానికీ వాడు అసమర్థుడు. అంతేగాక వాణ్ణి చూస్తే వాడి తల్లిదండ్రులకే అమిత రోతగా ఉండేది. అందుచేత వాళ్ళు అష్టవక్రుణ్ణి బంగారానికి అమ్మారు.

రాజు వద్దకు వచ్చిన అష్టవక్రుణ్ణి భటులు నరకపోతుండగా వాడు గట్టిగా నవ్వి, "నేను పనికిమాలిన వాణ్ణి కానన్నమాట. నా రక్తంతో సమానమైన మందు సృష్టిలోనే లేదట," అన్నాడు.

ఆ మాటవిని రాజు అష్టవక్రుణ్ణి విడిచిపెట్టి రాజవైద్యుణ్ణి మందలించి, మరొక విధంగా తన వ్యాధి నయంచేసుకున్నాడు.

—ఎం. సీతారాంరావు





# రాణి - దాసి

వైశాలీనగరంలో హిరాదత్తుడికి లేక లేక నలభైఏళ్ళ వయసులో ఒక బంగారుబొమ్మ లాటి కూతురు పుట్టింది. ఆ బిడ్డను చూసు కుని హిరాదత్తుడు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు.

అయితే అతని ఆనందం త్వరలోనే తీరని దుఃఖంగా మారింది. ఆ చంటి పిల్లను ఒకనాడు చల్లగాలికి తొట్టెతోసహా ఆరు బ య ట పడుకోబెట్టారు. ఇంతలో ఎక్కడి నుంచో ఒక బ్రహ్మాండమైన గద్ద వచ్చి, పొత్తి గుడ్డలను ముక్కుతోనూ, కాళ్ళతోనూ పట్టుకుని, ఆ బిడ్డతోసహా ఎటో వెళ్ళిపోయింది. హిరాదత్తుడు ఆ పక్షిని వేటాడటానికి వేటగాళ్ళను పంపాడు; తన బిడ్డను తనకు తెచ్చి ఇచ్చిన వారికి అంతు లేని ధనం ఇస్తానని దేశదేశాలా చాటింపు వేయించాడు. కాని అతని ప్రయత్నాలేవీ ఫలించలేదు.

ఇంతకూ, హిరాదత్తుడి బిడ్డను ఎత్తుకు పోయినది నిజంగా గద్ద కాదు. అది శాపం పొంది, కొంతకాలం పాటు యక్షలోకం నుంచి బహిష్కరించబడిన యక్షిణి. ఆమె పక్షి రూపంలో ఆకాశంలో తిరుగుతూ హిరా దత్తుడి కుమార్తెను చూసి, ఆ పిల్లను పెంచు కోవాలని ముచ్చటపడింది.

పక్షి ఎత్తుకు పోయిన కారణంగా హిరా దత్తుడి కుమార్తెకు శకుంతకుమారి అన్న పేరు వచ్చింది.

శకుంతకుమారి యక్షిణి పెంపకంలో ఎంతో ప్రపంచజ్ఞానమూ, అనేక యుక్తులూ నేర్చుకుని, పెరిగి పదహారేళ్ళ వయసు దయింది.

అప్పుడు ఒకనాడు యక్షిణి శకుంత కుమారితో, "అమ్మా, నా శాపం గడువు తీరిపోయింది. నేనిక మా లోకానికి తిరిగి పోతాను. నీకు అందమూ, తెలివి తేటలూ

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



ఉన్నాయి. ఏ రాజకుమారుడైనా నిన్ను కళ్ళ కద్దుకుని పెళ్ళాడతాడు. ఈ దిక్కుగా వెళ్ళావంటే నీ తండ్రి ఉండే వైశాలీనగరం వస్తుంది. నువు మీ తల్లిదండ్రులను చేరుకుని, నీకు తగిన భర్తని పెళ్ళాడు. నేను నేర్పిన యుక్తులన్నీ వినియోగించి సుఖంగా జీవించు," అని చెప్పి తన లోకానికి వెళ్ళిపోయింది.

శకుంతకుమారి తన జీవితమంతా అరణ్యం మధ్యనే గడిపి నప్పటికీ ఆమెకు అన్నిరకాల నాగరిక జీవితం గురించీ పూర్తిగా తెలుసు. అందుచేత ఆమె నాగరిక జీవితంలోకి అడుగు పెట్టటానికి సిద్ధపడి, వైశాలీనగరం ఉండే దిక్కుగా బయలుదేరింది.

ఆమె అరణ్యంలో కొంతదూరం వెళ్ళేసరికి ఒక చోట ఒక విచిత్రమైన రాజభవనం కనిపించింది. ఆమె ఆ భవనంలోకి ప్రవేశించింది. అందులో ఏనుగులూ, గుర్రాలూ, ద్వారపాలకులూ, సేవకులూ, దాసీలూ—అందరూ గాఢనిద్రలో ఉన్నారు. ఇంకా లోపలికి పోయి ఆమె ఒక శయన మందిరం ప్రవేశించింది.

అక్కడ ఒక అందగాడైన రాజకుమారుడు హంసతూలికా తల్పం మీద పడుకుని ఉన్నాడు. ఆ గదిలో గోడకు ఒక చిత్తరువు వేళ్ళాడుతున్నది. అందులో ఈ రాజకుమారుడే గుర్రం మీద ఎక్కి ఉన్నాడు. అయితే అతని మెడలో ఒక హారం చిత్రించి ఉన్నది. ఆ హారం ఇప్పుడు రాజకుమారుడి మెడలో లేదు; అది అతని పాదాల దగ్గిర ఒక పెట్టెలో పెట్టి ఉన్నది.

ఆ హారం అతని మెడలో లేక పోవటానికీ, అతని గాఢనిద్రకూ ఏమైనా సంబంధం ఉన్నదేమో చూడాలని, శకుంతకుమారి ఆ హారాన్ని పెట్టె నుంచి తీసి, అతని రొమ్ముకు ఆనించింది. వెంటనే రాజకుమారుడు నిద్రలో మసిలి, లేవబోయేవాడిలాగా కనబడ్డాడు.

శకుంతకుమారి ఆ హారాన్ని తీసి తిరిగి పెట్టెలో పెట్టింది. తాను ప్రయాణం చేసి

మట్టి కొట్టుకుని ఉన్నది. తన ఒంటి మీది బట్టలు మాసి, చిరిగి ఉన్నాయి. తాను చక్కగా స్నానం చేసి, రాజభవనంలో నుంచి మంచి బట్టలు తీసి కట్టుకుని, రాజకుమారుడు కళ్ళు తెరిచేసరికి అందంగా తయారవుదామనుకున్నది శకుంతకుమారి.

ఆమె ఆ గది నుంచే అందమైన బట్టలు ఏరి తీసుకుని, సమీపంలోనే ఉన్న కొలనుకు వెళ్ళి, అందులో స్నానం చెయ్య సాగింది.

ఆ సమయంలో అటుగా ఒక కుబ్జ ఏడుస్తూ వెళ్ళటం ఆమెకు కనిపించింది. ఆ మనిషి గూనిదీ, అనాకారిదీ అయినప్పటికీ, ఆమె దుఃఖం చూసి జాలిపడి శకుంతకుమారి ఆమెను పిలిచి, "ఎందుకు ఏడుస్తున్నావు? ఎక్కడికి పోతున్నావు?" అని అడిగింది.

"నా మొగుడు నన్ను ఇంట్లో నుంచి వెళ్ళగొట్టాడు. నేను ఈ మహారణ్యంలో ఏ పులి వాత అయినా పడతాను," అన్నది కుబ్జ దుఃఖంతో.

"విచారించకు. నీ పోషణ నేను చూస్తాను. నువు వెళ్ళి ఆ కనిపించే భవనం వద్ద ఉండు. నేను స్నానం పూర్తిచేసి వస్తాను," అన్నది శకుంతకుమారి.

కుబ్జ రాజభవనానికి వెళ్ళి లోపల ప్రవేశించి, రాజకుమారుడి గది చేరుకున్నది. శకుంతకుమారికి కలిగినట్టే కుబ్జకు కూడా హారం విషయం అనుమానం తగిలింది. ఆమె పెట్టెలోనుంచి హారాన్ని తీసి రాజ



కుమారుడి మెడకు తగిలించింది. త్వరలోనే రాజకుమారుడు మేలుకున్నాడు. అతనితోబాటు రాజభవనం అంతా మేలుకున్నది.

తన నిద్ర వదిలించినందుకు కుబ్జను రాజకుమారుడు పెళ్ళాడ నిశ్చయించాడు.

"నేనొక రాజకుమార్తెను. నా దాసి ఇప్పుడే వస్తుంది," అన్నది కుబ్జ రాజకుమారుడితో.

ఆమె అన్నట్టుగానే శకుంతకుమారి అక్కడికి చేరుతూ, రాజభవనమంతా మేలుకుని ఉండటం చూసి మోసం జరిగిందని గ్రహించింది. దానికి తగినట్టుగానే శకుంతకుమారి రాగానే కుబ్జ రాజకుమారుడితో, "అదుగో, నా దాసి!" అని చెప్పింది.

శకుంతకుమారి కుబ్జను నానా తిట్లూ తిట్టి, జరిగినదంతా రాజకుమారుడికి చెప్పింది.

"మీ ఇద్దరిలో ఎవరు దాసీ అయినదీ, ఎవరు రాణీ అయినదీ, ఎవరిని ఎవరు మోసం చేస్తున్నదీ నాకు తెలియటం లేదు. నేను ఇంతకు మునుపే నిద్ర లేచాను. నేను లేచేసరికి ఈ కుబ్జ ఎదురుగా కనిపించింది. ఈమెకే నేను ఋణపడి ఉన్నాననుకుంటున్నాను." అన్నాడు రాజకుమారుడు.

"ఎవరు రాణీ అయిందీ, ఎవరు దాసీ అయిందీ ఇప్పుడే తేలుస్తాను. రాణీ అనీ, దాసీ అని చీట్ల మీద రాసి, ఈ పెట్టెలో పోసి, చూడకుండా రాణీ చీటీలన్నీ నేను తీస్తాను.



అప్పుడు మీకే నిజం తెలుస్తుంది," అన్నది శకుంతకుమారి.

రాజకుమారుడు ఆ పరీక్షకు ఒప్పుకున్నాడు.

శకుంతకుమారి కొన్ని చీట్లు తయారు చేసి, వాటిమీద "రాణి", "ధాసి" అని రాసి, చీట్లన్నిటినీ ఒక పెట్టెలో వేసి, కళ్ళు మూసుకుని "రాణి" అని రాసిన చీట్లన్నీ, ఒక్కటి కూడా మీరు పోకుండా తీసేసింది. పెట్టెలో మిగిలిన చీట్లు అన్నిటి మీదా "దాసి" అనే ఉన్నది.

ఇది చూసి కుబ్జ వణికిపోతూ తాను చేసిన మోసం ఒప్పేసుకున్నది. శకుంతకుమారి కుబ్జను క్షమించి తన దాసిగా ఉండనిచ్చింది. రాజకుమారుడికీ, శకుంతకుమారికీ వైభవంగా పెళ్ళి జరిగింది. ఆ పెళ్ళికి వైశాలీనగరం నుంచి ఆమె తల్లిదండ్రులు వచ్చారు. ఏనాడో తమకు కాకుండా పోయిన తమ కుమార్తె తమకు తిరిగి దొరికినందుకు వాళ్ళు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు.

తన కథ అంతా శకుంతకుమారి తన తల్లిదండ్రులకు చెప్పింది. అప్పుడు తల్లి, "కుబ్జకు మంచి పరాభవమేచేశావు. కాని, చీట్లు లాగటంలో నువు ఏదో యుక్తి చేసి ఉండాలి. ఆ యుక్తి ఏమిటే?" అని శకుంతకుమారిని అడిగింది.

శకుంతకుమారి నవ్వి, "ఏమీ లేదమ్మా! సూటిగా కత్తిరించిన అట్టముక్కలు తీసుకుని, ఒక్కొక్కటీ మూడుగా మడిచి, మధ్యభాగంలో 'రాణి' అనీ, రెండు చివరభాగాలలోనూ 'దాసి' అనీ రాసి, ఒక్కొక్క అట్టనూ మూడేసి ముక్కలుగా చించాను. 'రాణి' అని రాసి ఉన్న చీటికి రెండు పక్కలా అంచులు గరుకుగా ఉంటాయి. 'దాసి' అని రాసి ఉన్న చీటికి ఒక అంచు నున్నగానూ, ఒక పక్క అంచే గరుకుగానూ ఉంటుంది. అందుచేత, 'రాణి' ముక్కలు తడివి తెలుసుకోవటం తేలిక. కుబ్జ నన్ను మోసగించినందుకు నేను దాన్ని అలా మోసం చేశాను," అన్నది శకుంతకుమారి.





# శ్రమకు ఫలితం

కొత్తపల్లి అనే గ్రామంలో కోటయ్య అనే భూస్వామి ఉండేవాడు. అతనిది చాలా తొందర స్వభావం. కాని అతనిలో ఒక మంచి గుణం ఉండేది. ఒళ్ళు వంచి పాటుపడే వాళ్ళంటే అతనికి ఎంతో అభిమానం.

కోటయ్య తన పొలం పని చూడటానికి ఇద్దరు జీతగాళ్ళను పెట్టుకున్నాడు. ఒకడి పేరు సోమన్న. రెండో వాడి పేరు సూరన్న. సోమన్న రెక్కలు వంచి, కష్టపడి పని చేసేవాడు. సూరన్న ఇందుకు విరుద్ధం. వాడికి పని అంటే ఒళ్ళు వంగేది కాదు.

వాళ్ళు తెల్లవారు ఝామునే లేచి పొలానికి వెళ్ళిన మొదటిరోజే పొలంలో ఇద్దరూ పనిచేస్తూ ఉండగా సూరన్న పనిమానేసి ఎటో వెళ్ళిపోయాడు. సాయంకాలానికి సోమన్న పని చాలించి, ఎడ్లను చెరువులో శుభ్రంగా కడిగి, తాను తన వంటి బురద కడుగుకుంటూ ఉండగా సూరన్న అక్కడికి వచ్చి, తన ఎడ్ల మీద ఇంత బురద పూసి, తన వంటికి కూడా ఇంత పూసుకుని, ముందుగానే ఇల్లు చేరుకున్నాడు.

కోటయ్య వాణ్ణి చూస్తూనే, వాడు కష్టపడి రోజల్లా పనిచేశాడనుకుని, తన భార్యతో, "సూరన్న బాగా శ్రమ చేస్తాడు. వాడికి తిండి మరింత పెట్టు," అని చెప్పాడు.

అంతలోనే సోమన్న ఎడ్లను తోలుకుని ఇంటికి చేరాడు. ఎడ్ల మీదగాని, సోమన్న మీదగాని బురద మరక లేదు. వాడు పని చెయ్యలేదని కోటయ్య నిశ్చయించుకున్నాడు.

అది మొదలు సోమన్నకు రోజూ చాలీచాలని తిండీ, సూరన్నకు విందు భోజనమూ లభిస్తూవచ్చింది.

కోటయ్య కూతురు కమల చాలా చురుకైన పిల్ల. జీతగాళ్ళు తిండి తినేటప్పుడు,

నీరుగట్టి శంకరప్ప



సోమన్నకు తిండి చాలటం లేదనీ సూర
న్నకు తిండి ఎక్కువవుతున్నదనీ అనుమా
నించింది.

జీతగాళ్ళ విషయంలో తన తండ్రి
పొరపాటు పడ్డాడో, లేదో తెలుసుకోవటానికి
కమల ఒకనాడు పనిపెట్టుకుని పొలానికి
వెళ్ళింది. పొలంలో సోమన్న ఒక్కడే పని
చేస్తున్నాడు. సూరన్న కోసం చూస్తే, వాడు
దూరంగా ఒక చెట్టు కింద పడుకుని నిద్ర
పోతున్నాడు.

తండ్రిలాగే కమలకు కూడా శ్రమపడే
వాళ్ళంటే చాలా అభిమానం. ఆమె సోమ
న్నను పలకరించి, అతను పనిచేసే పద్ధతి
కొంతసేపు చూసి ఆనందించి, ఇంటికి
తిరిగి వెళ్ళిపోయింది. సోమరిపోతు సూరన్న
ఒంటికి బురద పూసుకుని తన తండ్రిని
ఎలా మోసం చేస్తున్నాడో ఆమెకు అర్థ
మయింది.

ఇంటికి తిరిగి వస్తూనే ఆమె తన
తండ్రితో, "పొలం పని అంతా సోమన్న
ఒక్కడే చేస్తున్నాడు. సూరన్న రోజంతా
చెట్ల కింద పడుకుని నిద్రపోయి, ఒంటికి
ఇంత బురద పూసుకుని ఇంటికి వస్తు
న్నాడు. అది చూసి నువ్వు, వాడు చాలా
కష్టపడిపోతున్నాడనుకుని, వాణ్ణి ఎద్దును
మేపినట్టు మేపుతున్నావు. తిన్నది అరగక
వాడు ఒక్కోపూట వస్తూ ఉంటున్నాడు.
చచ్చేట్టు కష్టపడే సోమన్న, మనం పెట్టే
తిండి చాలక, ఎండిపోతున్నాడు," అన్నది.

ఆ సాయంకాలం సూరన్న ఒంటి నిండా
బురద పూసుకుని ఇంటికి రాగానే కోటయ్య,
"ఏమిరా, నువు పొలంలో పనిచెయ్యక,
ఒంటి నిండా బురద పూసుకుని వస్తు
న్నావా?" అని అడిగాడు.

"అదేమిటండీ? నేను పగలంతా చచ్చే
టట్టు పని చేస్తున్నాను. మీకీ అబద్ధం ఎవరు
చెప్పారు?" అన్నాడు సూరన్న.

ఇంతలోనే సోమన్న కూడా ఇల్లు
చేరాడు. "సూరన్న పొలంలో రోజల్లా
కష్టపడి పని చేస్తున్నాడా?" అని కోటయ్య
సోమన్నను అడిగాడు.

"సూరన్న పని చెయ్యటం నేను చూడలే దండీ," అన్నాడు సోమన్న.

"మరి ఈ సంగతి ఇన్నాళ్ళూ నాతో ఎందుకు చెప్పావు కావు ?" అని కోటయ్య సోమన్నను అడిగాడు.

"మీరు అడగలేదు, నేను చెప్పలేదు. వాడి మీద నేనేమన్నా కావలాదారునాండీ ?" అన్నాడు సోమన్న.

కోటయ్య సూరన్నకేసి తిరిగి, "నువు పని చెయ్యటం లేదని నా కూతురు చెప్పింది, సోమన్నా చెబుతున్నాడు. ఏమంటావు ?" అన్నాడు.

సూరన్న తడుముకోకుండా, "అసలు సంగతి అది కాదు లెండి. మీ అమ్మాయి రోజూ పొలం దగ్గిరికి వచ్చి సోమన్నతో సరసాలాడుతున్నది. ఆ సంగతి నే నెక్కడ బయట పెడతానో అని ఇద్దరూ కుట్రపన్ని నా మీద చాడీలు చెబుతున్నారు," అన్నాడు.

కోటయ్య తొందర మనిషి. దానికి తగ్గట్టు సోమన్న కాస్త నదరైనవాడు. అందుచేత కోటయ్య సూరన్న మాట నమ్మి, చేతి కర్రతో సోమన్నను చావబాదాడు. తరవాత ఆయన కమలతో, "ఈ సారి పొలానికి వెళ్ళావంటే నీ కాళ్ళు విరగగొడతాను," అన్నాడు.

ఆ రాత్రి సోమన్నకు అన్నం పెట్టవద్దని ఆయన తన భార్యకు చెప్పాడు.

తన ఎత్తు పారినందుకు సూరన్న చాలా సంతోషించి, ఇక తనకేమీ భయంలేదను కున్నాడు.







సూరన్న చెప్పిన అబద్ధంతో కమల మనసు విచిత్రంగా మారింది. సోమన్న తన తండ్రి చేత దెబ్బలు తిన్న క్షణం నుంచీ ఆమెలో అతని మీద అమితమైన అనురాగం పుట్టుకొచ్చింది. ఆ రాత్రి ఆమె భోజనం పట్టుకుపోయి సోమన్న చేత తినిపించింది. తరవాత ఆమె తన తల్లితో సూరన్న దుర్మార్గమూ, సోమన్నకు జరిగిన అన్యాయమూ చెప్పి, "సోమన్న ఎంత పెద్ద మనిషి! ఎంత పనిమంతుడు! రోజూ పొలానికి వెళ్ళి అతనితో సరసాలాడక పోవటం నాదే తప్పు!" అన్నది.

కూతురి మనసు తల్లి గ్రహించింది. మర్నాడు జీతగాళ్ళు పొలానికి వెళ్ళినాక ఆమె తన భర్తతో, "కొత్త జీతగాళ్ళను పెట్టినాక మీరసలు పొలంకేసి పోనేలేదు. పని ఎలా జరుగుతున్నదీ ఒకసారి చూసి రాగూడదూ?" అన్నది.

తన భార్య చెప్పినది నిజమేగదా అనుకుని కోటయ్య కాస్త పొద్దెక్కగానే పొలానికి వెళ్ళాడు. సోమన్న సొంత పొలంలో పనిచేసినట్టు పరధ్యానం లేకుండా పని చేసుకుపోతున్నాడు. సూరన్న చెట్టు కింద పడుకుని నిద్రపోతున్నాడు. తన కూతురు చెప్పినది అక్షరాలా నిజం. తాను భయంకరమైన తప్పులు చేశాడు: సోమరిగొడ్డును మేపి, పని చేసేవాణ్ణి ఎండగట్టాడు; ఆ సోమరి వెధవ నోటికి వచ్చినట్టు వాగితే, వాడి మాటలు నమ్మి సోమన్నను చావగొట్టాడు.

కోటయ్య దహించుకు పోతున్న అంతరాత్మతో ఇంటికి వచ్చిపడి తాను చేసిన తప్పు తన భార్యకు చెప్పుకున్నాడు. తాను చేసిన దానికి పరిహారం ఏమిటో ఆయనకు తెలీదు.

"మీరు ప్రతిదానికీ తొందర పడతారు. అమ్మాయి నాకు నిజం చెప్పింది. సోమన్న మన కుటుంబంలో వాడి వంటి వాడు. వాడు పరాయి పొలంలో పని చేసినట్టు చెయ్యడు. మీరు కొడితే, తనవల్ల ఏ తప్పూ లేకపోయినా, పల్లెత్తు జవాబు చెప్పక పడి

ఊరుకున్నాడు. మనకా మగపిల్లలు లేరు. పిల్లను ఎక్కడో ఇవ్వటం దేనికి? సోమన్నకే ఇస్తే, మనకు కూతురూ, అల్లుడూ కూడా కళ్ళ ఎదట ఉంటారు," అన్నది కోటయ్య భార్య.

భార్య ఇలా అనగానే కోటయ్య అంతరాత్మలో ఉన్న తపన అంతా తీసేసినట్టు పోయింది. అందుచేత ఆమె చెప్పిన సలహా సరి అయినది అనుకున్నాడు. ఆ సాయంకాలం జీతగాళ్ళు వచ్చే లోపల కోటయ్య కొన్ని ఏర్పాట్లు చేసి సిద్ధంగా ఉన్నాడు.

సూరన్నా, సోమన్నా ఇంటికి రాగానే అయన సూరన్నతో, "ఒరే, నువు సోమన్నకు ఒళ్ళు పట్టి, నలుగు పెట్టి, తలంటి స్నానం చేయించు," అన్నాడు.

"అదేమిటి? నేను వీడికి తలంటాలా? రోజల్లా కష్టపడి వచ్చాను. నా వల్ల కాదు," అన్నాడు సూరన్న.

"నోరు మూసుకుని చెప్పినట్టు చెయ్యక పోతే మక్కెలు విరగగొడతాను," అన్నాడు కోటయ్య.

సూరన్న యజమాని గొంతు విని హడలిపోయి, చచ్చినట్టు సోమన్నకు తలంటి స్నానం చేయించాడు. సోమన్నకు ఇదంతా ఏమీ అర్థం కాలేదు.

తలంటి స్నానం పూర్తి కాగానే, కోటయ్య సోమన్నను తనతోపాటు భోజనానికి కూర్చో బెట్టుకున్నాడు. తన కేసి వింతగా చూస్తున్న సోమన్నతో అయన, "ఎందుకు అంత ఆశ్చర్యపడతావు? నువు నాకు కాబోయే అల్లుడివిరా!" అన్నాడు.

అప్పుడు సోమన్నకు పరిస్థితి చాలావరకు అర్థమయింది.

తరవాత మంచి ముహూర్తం చూసి కోటయ్య తన కూతురికీ, సోమన్నకూ ఘనంగా పెళ్ళి చేశాడు.

ఇంత అయాక సూరన్నకు ఒక విషయం అర్థమయింది. శ్రమపడిన వాడు బాగుపడతాడు. ఈ నీతి గ్రహించి సూరన్న శ్రమపడి పని చెయ్యటం నేర్చుకున్నాడు. వాడిలో వచ్చిన మార్పు చూసి కోటయ్య చాలా సంతోషించాడు.





# అనాగరికుడు

పూర్వం బాగ్దాదునగరాన్ని అహ్మద్ అనే ఖలీఫా పరిపాలించేవాడు. ఆయనకు అనేక దేశాలు జయించి, పాదుషా కావాలనే దురభిలాష ఉండేది. ఆయన కుమార్తె అయిన మెహర్‌కు తన తండ్రి దురాశ అంటే ఏ మాత్రం ఇష్టం లేదు. కాని ఆయనతో ఆ మాట అనటానికి ఆమె సాహసించలేకపోయింది.

ఖలీఫా తన కుమార్తె వివాహం తల పెట్టాడు. ఆమెను వివాహ మాడటానికి చాలామంది యువకులు ఉవ్విళ్ళూరుతున్నారు.

"నన్ను పెళ్ళాడగోరి వచ్చేవారికి ఒక కథ చెప్పి, ఒక ప్రశ్న వేస్తాను. దానికి సరిఅయిన సమాధానం చెప్పిన వారిని పెళ్ళాడతాను," అని మెహర్ తన తండ్రితో అన్నది. అందుకు ఖలీఫా సంతోషంగా అంగీకరించాడు.

మెహర్ అడిగే ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోతే తలవంపు లవుతుందని చాలా మంది యువకులు తమ ప్రయత్నం నుంచి విరమించుకున్నారు: రజాక్ అనే మరో సుల్తాను కుమారుడు మాత్రం మెహర్ వేసే ప్రశ్నకు సమాధానం చెబుతానని వచ్చాడు.

పెద్దలందరి సమక్షంలో మెహర్ రజాక్‌ను కూర్చోబెట్టి ఈ విధంగా కథ చెప్ప నారంభించింది:

"పూర్వం ఈజిప్టులో అబ్దుల్ సమద్ అనే సుల్తాను పాలించాడు. అతడు తనకు గల రాజ్యంతో తృప్తి చెందక, చక్రవర్తి కావాలన్న కాంక్షతో పెద్ద సైన్యాన్ని పోగు చేసుకుని, దండయాత్రకు బయలుదేరాడు. ఆఫ్రికా ఖండంలోని రాజులు చాలామంది, అబ్దుల్‌తో పోరాడే శక్తి లేక, సామంతులుగా ఉండటానికి సంధి చేసుకుని, కప్పాలు కట్ట టానికి ఒప్పుకున్నారు.

కొపుగంటి లక్ష్మీపత్వతపర్తని

"అబ్దుల్‌కు లొంగక, అతన్ని ఎదిరించి పోరాటానికి దిగినవాడు బెటూస్ఫా. అతని రాజ్యమంతా అడవులమయమూ, కొండల మయమూనూ. అతని సైనికులు ఆటవికులు. వాళ్ళు అడవులలో నుంచీ, కొండలలో నుంచీ హఠాత్తుగా వచ్చిపడి, విషపు బాణాలతో ఈజిప్టు సైనికులను చంపి, అంతు చిక్కకుండా పారిపోతూ ఉండేవారు. వాళ్ళతో ముఖాముఖి యుద్ధం చెయ్యటం అబ్దుల్ సేనలకు సాధ్యం కాలేదు.

నిజానికి బెటూస్ఫా ఏలే ప్రాంతాన్ని గెలవటం వల్ల అబ్దుల్‌కు ఏ విధంగానూ లాభించదు. కాని తన అధిపత్యాన్ని తృణీకరించే వాణ్ణి స్వేచ్ఛగా వదలగూడదనుకుని, విజయం సాధించటానికి అబ్దుల్ పట్టు బట్టాడు.

అందుచేత అతను తన సైనికుల చేత ఆ ప్రాంతంలోని అడవులలో గల చెట్లూ, పొదలూ నరికించి, ఆవిటకులు దాగటానికి చోటు లేకుండా చేశాడు.

అప్పుడు బెటూస్ఫా తన సైన్యంతో ముఖాముఖి యుద్ధానికి దిగాడు. ముఖాముఖి యుద్ధంలో సహజంగా ఈజిప్టు సేనలే నెగ్గాయి. బెటూస్ఫా సైనికులు చంపగలిగినంతమంది ఈజిప్టు సైనికులను చంపి, ఒక్కడు కూడా మిగలకుండా అందరూ వీరమరణం పొందారు.



"యుద్ధం అయిపోగానే బెటూస్ఫా శవాన్ని చూడాలన్న కోరికతో, కొంతమంది సైనికులను వెంట బెట్టుకుని యుద్ధభూమి ప్రవేశించాడు అబ్దుల్.

"అకస్మాత్తుగా ఆయనకు శవాల గుట్టల మధ్య ఒక నల్లని భయంకరాకారం నిలబడి, దిక్కులు చూస్తూ ఉండటం కనిపించింది.

"'వీడెవరు?' అని అబ్దుల్ తన సేనానిని అడిగాడు.

"'ఆఫ్రికా అడవులలో నరమాంస భక్షకులు ఉన్నారట. వీడు శవాలను పీక్కు తినటానికి వచ్చి ఉంటాడు,' అన్నాడు సేనాని.

"అబ్దుల్ ఆ నరమాంస భక్షకుడితో, 'నీకు కావలిసిన శవాలను పట్టుకుపోక దిక్కులు చూస్తూ శవాల మధ్య నిల బడ్డావేం?' అన్నాడు.

"'వీళ్ళనందరినీ తినడానికి ఎవరో చంపు కున్నారు. నాకు కావలిసింది ఒక్కటే శవం. అయినా అనుమతి తీసుకుని శవాన్ని తీసుకు పోవటం ధర్మం కదా! అందుకని, ఈ అందరినీ చంపిన వాడి కోసం చూస్తు న్నాను,' అన్నాడు ఆ నల్లవాడు.

"అబ్దుల్ నవ్వి, 'వీరందరినీ చంపినది నేనే. కాని తినడానికి మాత్రం కాదు,' అన్నాడు.

"నల్లవాడు ఆశ్చర్యపోతూ, 'తినడానికి కాకపోతే ఇంతమందిని ఎందుకు చంపావు?' అని అడిగాడు.

"సుల్తాను సేనానితో, 'వీడు అనాగరి కుడు. వాడికి అర్థమయేటట్టు చెప్పడం మనకు సాధ్యం కాదు,' అన్నాడు.

"నల్లవాడు పకపకా నవ్వుతూ వెళ్ళి పోయాడు."

మెహర్ ఈ కథ చెప్పి, "నల్లవాడు నవ్వటానికి కారణం ఏమిటి?" అని రజాక్‌ను అడిగింది.

"అనాగరికుడుగా భావించబడే ఆ నల్ల వాడు ఆకలి అయితే తప్ప మనిషిని చంపడు. కాని నాగరికుడననుకునే అబ్దుల్ తన అధికారాన్ని పెంచుకోవాలన్న కాంక్షతో వేలాది మనుషుల ప్రాణాలు తీశాడు. కొంచెం ఆలోచిస్తే ఆ ఇద్దరిలోనూ అనాగరి కుడు ఎవరో మనకే తెలుస్తుంది. అందుకే నల్లవాడు నవ్వాడు," అని రజాక్ జవాబు చెప్పాడు.

అతను చెప్పినది తన ప్రశ్నకు సరి అయిన సమాధానమేనని మెహర్ ఒప్పు కున్నది. వారిద్దరికీ వివాహం జరిగింది.

మెహర్ చెప్పిన కథా, రజాక్ ఆమె ప్రశ్నకు ఇచ్చిన సమాధానమూ విన్న మీదట మెహర్ తండ్రి అయిన ఖలీఫాకు చక్రవర్తి కావాలన్న కోరిక కాస్తా పోయింది. ఆ విధంగా తన తెలివితేటలతో, మెహర్ తన తండ్రిని సంస్కరించగలిగింది.






కృష్ణుడు ద్వారకకు బయలుదేరి వెళ్ళి పోగానే ఉపప్లావ్యంలో ధర్మరాజూ, విరాటుడూ, ఇతర రాజులూ యుద్ధప్రయత్నాలు ప్రారంభించారు. మంత్రి, బంధు, మిత్రులతో వెంటనే బయలుదేరి రమ్మని అందరు రాజులకూ విరాటుడూ, ద్రుపదుడూ కలిసి వార్తలు పంపారు. అలా వార్తలు అందిన రాజులు, పాండవుల మీది ప్రేమ చేతనైతేనేమి, విరాట ద్రుపదుల పట్ల గల గౌరవం చేతనైతేనేమి, ఉపప్లావ్యానికి రాసాగారు.

ఇక్కడ యుద్ధయత్నాలు సాగుతున్నట్టు తెలియగానే ధృతరాష్ట్రుడి కొడుకులు కూడా తమ తమ మిత్రులను పిలిపించనారంభించారు. ఈ విధంగా, రానున్న కురుపాండవ యుద్ధానికి గాను దేశాలన్నిటా సంచలనం కలిగింది. పెద్ద పెద్ద సేనల నడకతో భూమి అదిరిపోయింది.

ఈ లోపల ద్రుపదుడు తన పురోహితుణ్ణి కౌరవుల వద్దకు రాయబారం పంపబోతూ, "నువు ప్రజ్ఞావంతుడవు. ధృతరాష్ట్రుడు ఎలాటివాడో, ధర్మరాజు ఎలాటివాడో నీకు బాగా తెలుసు. కౌరవులు పాండవులను ఎలా మోసం చేశారో ధృతరాష్ట్రుడు ఎరుగును. విదురుడు వద్దంటున్నా వినక, తన కొడుకు కోరాడని ఆయన ధర్మరాజును జూదం ఆడటానికి పిలిపించాడు. వాళ్ళు ఇప్పుడు పాండవులకు రాజ్యం ఇవ్వకుండా ఉండటానికే నిశ్చయించుకుని ఉన్నారు. నువు ధృతరాష్ట్రుడితో ధర్మం చెప్పు. విదు

44. యుద్ధప్రయత్నాలు



రుడు నీకు సహాయంగా మాట్లాడతాడు. నువు పాండవుల మంచితనమూ, దుర్యోధనుడి చెడ్డతనమూ నొక్కిచెప్పినట్టయితే వారి పక్షం వారు అధర్మం కోసం యుద్ధం చెయ్యటానికి వెనకాడుతారు. వారిలో ఈ విధంగా చీలిక తీసుకు రావటమే నీ ప్రధాన కర్తవ్యం. ఈ పని నీ వల్ల అవుతుంది. దుర్యోధనాదుల వల్ల నీకు ఎలాటి భయమూ ఉండదు. నువు దూతవేగాక, వయసులో చాలా పెద్దవాడివి," అని హెచ్చరించాడు.

ద్రుపదుడి పురోహితుడు తన శిష్య గణాన్ని వెంట బెట్టుకుని హస్తినాపురానికి బయలుదేరి వెళ్ళాడు.

తరవాత పాండవులు ఇతర రాజుల వద్దకు దూతలను పంపారు గాని, కృష్ణుడి వద్దకు అర్జునుడు స్వయంగా బయలుదేరాడు. వేగులవాళ్ళ ద్వారా పాండవుల చర్యలన్నీ తెలుసుకుంటున్న దుర్యోధనుడు కొద్దిపాటి పరివారాన్ని వెంట బెట్టుకుని, తాను కూడా స్వయంగానే ద్వారకకు వెళ్ళాడు. అర్జునుడూ, దుర్యోధనుడూ ఒకే రోజు ద్వారకలో అడుగు పెట్టారు.

ఇద్దరూ కృష్ణుడి ఇల్లు చేరేసరికి కృష్ణుడు నిద్రపోతున్నాడు. కృష్ణుడి తలదిక్కుగా ఒక ఉత్తమాసనం ఉన్నది. దుర్యోధనుడు తిన్నగా వెళ్ళి అందులో కూర్చున్నాడు. దుర్యోధనుడి వెనకనే అక్కడికి ప్రవేశించిన అర్జునుడు చేతులు కట్టుకుని, కృష్ణుడి కాళ్ళ వద్ద నిలబడ్డాడు.

మరికొంత సేపటికి కృష్ణుడు నిద్రలేస్తూ, తన కాళ్ళ వద్ద నిలబడి ఉన్న అర్జునుణ్ణి చూసి, తరవాత తన తల వైపున కూర్చుని ఉన్న దుర్యోధనుణ్ణి చూశాడు. అతను ఇద్దరితోనూ కుశలప్రశ్నలు చేసి, అతిథి సత్కారాలు పూర్తి చేసిన మీదట వారు వచ్చిన పని అడిగాడు.

దుర్యోధనుడు చిరునవ్వు నవ్వుతూ, "కృష్ణా, మాకు జరగబోయే యుద్ధంలో నువు నా పక్షాన ఉండి సహాయం చెయ్యాలి. నీకు నేనొకటి, అర్జునుడు ఒకటి కాదు

గద! ఇద్దరమూ నీకు ఒకేరకం బంధువులం. అయినా ముందుగా నేను నీ వద్దకు వచ్చాను. అందుచేత నువు నాకే సహాయం చెయ్యటం ధర్మం," అన్నాడు.

దానికి కృష్ణుడు, "నువు ముందే వచ్చావు గాని, నేను ముందు అర్జునుణ్ణి చూశాను. అందుచేత, నేను మీ ఇద్దరికీ సహాయం చేస్తాను. చిన్నవాడు గనక అర్జునుడు ముందు కోరుకుంటాడు. నా వంటి వారు యోధులు పదిలక్షల మంది ఉన్నారు. వారు ఒక పక్షం. నేను మరొక పక్షం. నేను మాత్రం యుద్ధం చెయ్యను, సలహా ఇస్తాను. అర్జునా, ఇందులో నువు ఏ పక్షం కోరుకుంటావు?" అని అడిగాడు.

అర్జునుడు కృష్ణుణ్ణి ఎంచుకున్నాడు. పది లక్షలమంది గోపాలయోధులను తీసుకోవటానికి దుర్యోధనుడు సంతోషంగా ఒప్పుకున్నాడు. తరవాత అతను బలరాముడి వద్దకు వెళ్ళి, యుద్ధంలో సహాయం చెయ్యమని కోరాడు.

బలరాముడు దుర్యోధనుడితో, "నాయనా, విరాటనగరంలో పెళ్ళికి వెళ్ళినప్పుడు నేను మీ రెండు పక్షాలను సమానంగా చేసి మాట్లాడాను. కాని కృష్ణుడు నాతో ఏకీభవించలేదు. ఏ పక్షానికీ సహాయం చెయ్యరాదని నేను అప్పుడే నిశ్చయించుకున్నాను. కాకపోయినా, నీకు ఒకరి సహాయంతో ఏం



పని? వెళ్ళి క్షాత్రధర్మంతో యుద్ధం చెయ్యి!" అన్నాడు.

దుర్యోధనుడు పరమానంద భరితుడై, బలరాముణ్ణి గట్టిగా కౌగలించుకుని, తనకు విజయం కలిగినట్టే భావించుకుని, కృతవర్మ వద్దకు వెళ్ళి, ఆయనను సహాయం అడిగాడు. కృతవర్మ దుర్యోధనుడికి ఒక అక్షౌహిణీ సేన ఇచ్చాడు. దుర్యోధనుడు ఈ విధంగా తాను వచ్చిన పని పూర్తి చేసుకుని హస్తినాపురానికి తిరిగివెళ్ళాడు.

దుర్యోధనుడు వెళ్ళిపోగానే కృష్ణుడు అర్జునుడితో, "నేను యుద్ధం చెయ్యనని చెప్పాను గదా, నన్నే కోరుకుని పెద్ద సేనను ఎందుకు పోగొట్టుకున్నావు?" అని అడిగాడు.




దానికి అర్జునుడు, "ఆ సేనను నువ్వు ఒక్కడివే జయించగలవు. శత్రువుల నందరినీ నే నొక్కణ్ణే జయించగలను. నువ్వు యుద్ధం చేస్తే ఆ కీర్తి అంతా నీకే దక్కుతుంది గాని నాకేం మిగులుతుంది? నాకు కాస్త కీర్తి కాంక్ష ఉండటం చేత, యుద్ధం చెయ్యాని నిన్నే కోరుకున్నాను. నువ్వు నాకు ఒక్క సహాయం చెయ్యాలి — నువ్వు నాకు రథసారథిగా ఉండాలి. ఈ కోరిక నాకు చాలా కాలంగా ఉన్నది. నువ్వు సారథిగా ఉంటే, ఈ కౌరవ సైన్యాన్నేమిటి, సురాసురులు ఏకమై వచ్చినా జయించగలను. అందుచేత నా ఈ కోరిక కాదనకుండా తీర్చు." అన్నాడు.

"నీ కోరిక తప్పకుండా తీర్చుతాను," అని కృష్ణుడు మాట ఇచ్చి, అర్జునుణ్ణి పంపేశాడు.

మద్రదేశపు రాజూ, నకులసహదేవుల మేనమామా అయిన శల్యుడికి పాండవులు పంపిన దూత ద్వారా పిలుపు అందింది. ఆయన పాండవులకు సహాయం చెయ్యటానికి ఒక అక్షౌహిణి సేననూ, మహారథులైన తన కొడుకులనూ వెంట బెట్టుకుని బయలుదేరాడు. మద్రదేశపు దుస్తులూ, అలంకారాలూ, వాహనాలూ, రథాలూ విచిత్రంగా ఉండేవి. మహా పరాక్రమవంతుడయిన శల్యుడు ఆ వింత సేనతో మజిలీలు చేసుకుంటూ పాండవులున్న చోటికి రాసాగాడు.

శల్యుడు పాండవులకు సహాయం వెళుతున్న సంగతి చారుల వల్ల తెలుసుకుని దుర్యోధనుడు, తన మనుషుల ద్వారా శల్యుడు మజిలీ చేసినప్పుడల్లా సకల సదుపాయాలూ చేయించాడు. గుడారాలు వేయించి, వాటిని అలంకరింపజేశాడు; అద్భుతమైన వంట ఏర్పాట్లూ, వినోదాలూ అమర్చాడు. శల్యుడికి ప్రయాణం అమిత సుఖంగా జరిగింది. ఇదంతా తనకోసం ధర్మరాజు చేయిస్తున్న ఏర్పాటనని శల్యుడు అనుకుని ఒకసారి, "నాకీ సదుపాయాలు చేయిస్తున్న వాళ్ళను తీసుకు రండి. వారు కోరిన వరాలిస్తాను," అన్నాడు.

రహస్యంగా శల్యుడి వెంటనే ఉంటున్న దుర్యోధనుడు ముందుకు వచ్చాడు. శల్యుడు అతన్ని తగిన విధంగా సత్కరించి, "నాయనా, నీ కేమి కావాలో చెప్పు, తప్పక ఇస్తాను," అన్నాడు.

వెంటనే దుర్యోధనుడు, "రాజా, నా సైన్యానికి నాయకుడివిగా ఉండు," అన్నాడు.

శల్యుడు అందుకు సమ్మతించి, "దుర్యోధనా, ఇప్పుడు నువు మీనగరానికి తిరిగి వెళ్ళు. నేను ధర్మరాజును చూడవలసిన పని ఉన్నది. అతనితో మాట్లాడి నీ దగ్గిరికి వస్తాను," అన్నాడు.

"ధర్మరాజును చూసి త్వరగా వచ్చెయ్యి. మా విజయం నీ పైనే ఆధారపడి ఉన్నది," అని దుర్యోధనుడు శల్యుణ్ణి కౌగలించుకుని, హస్తినాపురానికి వెళ్ళిపోయాడు.

తరవాత శల్యుడు ఉపప్లావ్యంలోని పాండవ సైనికశిబిరాన్ని చేరుకుని, ధర్మరాజు నుంచి అతిథి సత్కారాలు పొంది, నకుల సహదేవులను కౌగలించుకుని, వారిని తన చెంత కూర్చోబెట్టుకుని, ధర్మరాజుతో, "రాజా, క్షేమంగా వున్నావా? దైవానుగ్రహం వల్ల అరణ్యవాసం నుంచి బయటపడ్డావు. అంతకన్న దారుణమైన అజ్ఞాతవాసం కూడా చేశావు. రాజ్యభ్రష్టుడికి కష్టాలు గాక సుఖాలు కలుగుతాయా? కౌరవులను యుద్ధంలో గెలిచి సుఖపడతావులే. ఇంత జరిగాక నిన్నూ, నీ తమ్ములనూ సుఖంగా ఉండగా చూశాను. అంతేచాలు," అన్నాడు.





అయన ధర్మరాజుతో, తాను వచ్చే దారిలో దుర్యోధనుడు చేసిన అతిథిమర్యాదలూ, అతడికి సహాయపడతానని ఎలా మాట ఇచ్చినదీ చెప్పాడు.

అంతా విని ధర్మరాజు, "మహారాజా, నువు చేసిన పని మంచిదే. సంతోష పెట్టిన వాడి కోరిక తీర్చటం పెద్దవాళ్ళు చెయ్యదగినదే కదా! కాని నాకు కూడా ఒక గొప్ప ఉపకారం చెయ్యాలి. నువు యుద్ధరంగంలో కృష్ణుడితో సమానుడివి. కర్ణార్జునులకు యుద్ధం జరిగినప్పుడు నువు కర్ణుడికి సారథ్యం చెయ్యవలసిన అవసరం కలుగుతుంది. అందుకు సందేహం లేదు. ఎందుకంటే అర్జునుడి సారథి అయిన కృష్ణుడితో సమానుడు కౌరవసేనలో మరొకడు ఉండడు. కర్ణుడికి సారథ్యం చేసేటప్పుడు అర్జునుణ్ణి రక్షించు. కర్ణుడికి ఉత్సాహ భంగం చెయ్యి. ఇదే నా ప్రార్థన," అన్నాడు.

దానికి శల్యుడు, "నీకేమీ విచారం వద్దు. అవకాశం వచ్చినప్పుడు దుర్మార్గుడైన కర్ణుడి సంగతి నేను చూస్తాను. అర్జునుడికి విజయం కలిగేటట్టు చేస్తాను," అన్నాడు.

ధర్మరాజు అనుభవించిన కష్టాలను గురించి ప్రస్తావించుతూ, దేవేంద్రుడంతటివాడు అనుభవించిన కష్టాలను గురించి శల్యుడు ఈ విధంగా చెప్పాడు:

త్వష్టప్రజాపతి ఇంద్రుడికి ద్రోహం తలపెట్టి, ఇంద్రుణ్ణి జయించగల విశ్వరూపుడనే వాణ్ణి సృష్టించాడు. విశ్వరూపుడికి మూడు తలలు. ఈ మూడు తలలవాడు ఇంద్రపదవి కోసం తపస్సు ప్రారంభించాడు. వాడి తపస్సు ఫలిస్తుందని ఇంద్రుడు భయపడి, ఆ విశ్వరూపుడి తపస్సుకు భంగం కలిగించమని అందగత్తెలైన అప్సరసలను పంపాడు. కాని వాళ్ళు విశ్వరూపుడి బుద్ధిని చలింపజేయలేకపోయారు.

అప్పుడు ఇంద్రుడు తానే వెళ్ళి విశ్వరూపుణ్ణి వజ్రాయుధంతో కొట్టి చంపాడు.

అందువల్ల ఇంద్రుడికి భయం తీరిపోయింది గాని, త్వరలోనే అంతకన్న పెద్ద ప్రమాదం అతనికి దాపరించింది.

తన కొడుకును ఇంద్రుడు చంపాడని తెలిసి త్వష్ట మండిపడి, ఇంద్రుణ్ణి చంప గల వాణ్ణి, వృత్రుడు అనేవాణ్ణి సృష్టిం చాడు. ప్రళయకాల సూర్యుడిలాటి వృత్రుడు తండ్రి ఆజ్ఞమీద స్వర్గానికి వెళ్ళి, ఇంద్రుణ్ణి యుద్ధానికి పిలిచాడు. ఆయుధాలు లేని వృత్రుడు ఇంద్రుడి అస్త్రాలను లక్ష్యపెట్టక, అతన్ని పట్టుకుని మింగేశాడు. కాని వృత్రుడికి ఆవలింత వచ్చేసరికి ఇంద్రుడు తిరిగి బయటపడి, వృత్రుడితో యుద్ధం మాని పారిపోయాడు.

తరవాత ఇంద్రుడు దేవతలను వెంట బెట్టుకుని విష్ణువు వద్దకు వెళ్ళి, తనకు దాపురించిన కష్టాలు తెలిపి, వృత్రుణ్ణి చంపే ఉపాయం చెప్పమన్నాడు.

"వృత్రుడు ఇప్పుడు చావడు. వాడితో ముందు సఖ్యం చేసుకో," అని విష్ణువు ఇంద్రుడికి సలహా ఇచ్చాడు. అప్పుడు మహర్షులు వెళ్ళి, వృత్రుడితో, "నువ్వు ఇంద్రుణ్ణి జయించలేవు. ఇంద్రుడు నిన్ను జయించలేడు. మీరిద్దరూ సంధి చేసుకుని సౌఖ్యంగా ఉండండి," అని చెప్పారు.

వృత్రుడు వారి మాట విని ఇంద్రుడితో సంధి చేసుకుని, ఇంద్రుడంటే చాలా ప్రేమతోనూ, గౌరవంతోనూ ఉంటూ వచ్చాడు. కాని ఇంద్రుడు సమయం కోసం కాచుకుని ఉండి, ఒక సాయంకాలం వృత్రుడు ఒంటరిగా సముద్ర తీరాన విహరిస్తున్న సమయంలో, తన వజ్రాయుధంతో చంపేశాడు.

విశ్వరూపుణ్ణి చంపిన పాపమూ, వృత్రుణ్ణి చంపిన పాపమూ చుట్టుకుని ఇంద్రుడు మతిచెడి, ఎవరికీ కనపడకుండా తిరగసాగాడు. ఇంద్రుడిలా అయిపోగానే ఇంద్రపదవికి మరొకరిని చూడవలసి వచ్చింది. మహర్షులు నహుషుడి వద్దకు వెళ్ళి, ఆయనను ఇంద్రపదవి గ్రహించమనీ, మూడు లోకాలూ ఏలమనీ వేడుకున్నారు.





# శివపురాణం

## 21

స్వాయంభువు మనువు కాలంలో అరవై సంవత్సరాల పాటు వర్షాలు లేక అతి భయంకరమైన పరిస్థితి ఏర్పడింది. జనక్షయమూ, జంతుక్షయమూ విపరీతంగా కలిగి జీవితమంతా అస్తవ్యస్తమయింది. అది చూసి బ్రహ్మ, ప్రపంచమంతటినీ చక్కదిద్దగల వాణ్ణి రాజుగా చెయ్యాలని సంకల్పించాడు. ఆయనకు మనువంశంలో రిపుంజయు డనే సకలసద్గుణ సంపన్నుడు కనిపించాడు. రిపుంజయుడితో బ్రహ్మ, "నాయనా, నీకు ప్రపంచాధిపత్యం ఇస్తాను. దివోదాసు అనే పేరుతో భూమిని సమర్థంగా పాలించు. వాసుకి కుమార్తె అయిన అనంగమోహిని నీకు భార్య అవుతుంది," అన్నాడు.

ఆ మాటకు రిపుంజయుడు, "తాతగారూ, ఒక్క వరం అనుగ్రహిస్తే మీరు కోరినట్టు భూభారం వహిస్తాను. ఆ వరం ఏమిటంటే, భూమి మీద కిందిలోకాల వాళ్ళు గాని పైలోకాల వాళ్ళు గాని ఒక్కడు కూడా ఉండరాదు," అన్నాడు.

అందుకు బ్రహ్మ సమ్మతించి, ఈ సంగతి కాశీవిశ్వేశ్వరుడికి తెలిపాడు. విశ్వేశ్వరుడు సరే నన్న మీదట ఆయన రిపుంజయుడికి పట్టంకట్టి తనలోకానికి వెళ్ళిపోయాడు. తరవాత రిపుంజయుడు దివోదాసుడు అనే బిరుదుతో రాజై, ప్రపంచం మీద దేవతలు గాని, పాతాళవాసులు గాని ఉండరాదని చాటింపు వేశాడు.

ఈ చాటింపు విని భూమి మీద ఎక్కడెక్కడ ఉంటున్న దేవతలూ కాశీవిశ్వనాధుడి వద్దకు వచ్చారు. వారితో శివుడు, "నన్ను ముందుగా అడిగే బ్రహ్మ దివోదాసుకు వరం ఇచ్చాడు. మనమంతా మందరపర్వతానికి పోదాం," అన్నాడు.

అట్ట చివరి బొమ్మ



ప్రపంచం మీద ఎక్కడా దేవతలు లేకుండా పోయారు. దేవాలయాలలో పూజలు నిలిచి పోయాయి. దివోదాసు కాశీని రాజ ధానిగా చేసుకుని, ఎనిమిదివేల ఏళ్ళు ఎలాటి వంకా లేకుండా పరిపాలించాడు. దీర్ఘ కాలంగా భూమినే ఆశ్రయించుకుని, అదే తమ జన్మభూమిగా ఉన్న చిల్లర దేవతలూ, దానవులూ దివోదాసు దగ్గిర కొలువుచేశారు.

భూలోకంలో తమ ఆటకట్టయినందుకు దేవతలు మహా బాధపడి పోయి, "దివో దాసును రాజ్యభ్రష్టుణ్ణి చెయ్యటం ఎలా?" అని తమ గురువైన బృహస్పతిని అడిగారు.

"అగ్నీ, వాయువూ, వరుణుడూ మన వాళ్ళే గద. వాళ్ళు తమ శక్తులను ఉప సంహరించారంటే భూమిలో జీవితం స్తంభించిపోతుంది. ముందు అగ్నిని సహాయ నిరాకరణం చెయ్యమనండి," అన్నాడు బృహస్పతి.

కాశీలో ఎక్కడా నిప్పు రాజలేదు. వంటలు లేవు. దివోదాసుడికి మాత్రం ఎండ సహాయంతో భోజనం చేసి పెట్టారు. దివో దాసుడికి భోజనం అందిందిగాని ప్రజలు వచ్చి గోలపెట్టారు. సంగతిగ్రహించి దివో దాసుడు, "ఇది దేవతల దుర్మార్గం. మీరేమీ భయపడకండి. నా తపస్సు చేత మీకు నేనే అగ్నినీ, వాయువునూ, వర్షాలనూ ఇస్తాను," అని ప్రజలకు చెప్పి, అంతపనీ చేశాడు. దేవతల ఎత్తుపారలేదు.

అయితే శివుడికే కాశీవియోగం కష్ట మయింది. ఆయనకు కూడా దివోదాసు పరి పాలన అంతం చెయ్యాలనిపించింది. ఆయన అరవైనలుగురు సిద్ధయోగినులను పిలిచి, "మీరు మారువేషాలలో కాశీనగరానికి వెళ్ళి, అక్కడి స్త్రీల పాతివ్రత్యాన్నీ, పురుషుల ధర్మబుద్ధినీ చెడగొట్టండి. అలా అయితే గాని దివోదాసుడు పతనం కాడు," అని హెచ్చరించాడు.

సిద్ధయోగినులు శివుడు చెప్పినట్టే చేశారు. కాని శివుడు సాధించమన్న కార్యం సాధించలేక పోయారు. అది గ్రహించి శివుడు సూర్యుడితో, "నువు కాశీకి వెళ్ళి

దివోదాసు ఎలాగైనా ధర్మం తప్పేటట్టు చెయ్యి." అన్నాడు.

సూర్యుడు రకరకాల వేషాలు ధరించి కాశీలో తిరుగుతూ దివోదాసుడిలో ఏ ధర్మ లోపమైనా కనిపిస్తుందేమోనని చూశాడు. దివోదాసుడిలోనే కాదు, అతని ప్రజలలో కూడా కించిత్తయినా అధర్మం సూర్యుడికి కనిపించలేదు. పని పూర్తికాకుండా తిరిగి పోవటం ఇష్టంలేక సూర్యుడు కాశీలోనే ఉండిపోయాడు.

తరవాత శివుడు బ్రహ్మను పిలిపించి, "దివోదాసును పతనం చెయ్యమని యోగినులను పంపాను. వారి వెనకగా సూర్యుణ్ణి పంపాను. వారందరూ కాశీలో చిక్కుకుపోయి తిరిగి రాకుండా ఉన్నారు. ఈ సారి నువు వెళ్ళు." అన్నాడు.

బ్రహ్మ సరేనని వృద్ధబ్రాహ్మణుడి వేషంలో కాశీకి వెళ్ళి, సభ తీరి ఉన్న దివోదాసును చూసి ఆశీర్వదించి, "రాజా, నువు అనుమతించినట్టయితే కాశీనగరంలో యజ్ఞాలు చేస్తాను. అయితే విశ్వేశ్వరుడు లేని కాశి చిన్నబోతున్నది. శివుణ్ణి రప్పిస్తే బాగుండును." అన్నాడు.

శివుణ్ణి పిలిపించటం గురించి దివోదాసుడు ఎటూ చెప్పలేదు. బ్రహ్మ కాశీలో పది అశ్వమేధాలు చేసి, అక్కడే ఉండి పోయాడు.



వెళ్ళిన బ్రహ్మ కూడా తిరిగి రాకపోయే సరికి శివుడు ప్రమథులను కాశీకి పంపాడు. కాశీక్షేత్రంలోని మహత్తు ఎలాటిదో గాని, ప్రమథులు కాశీ చేరుతూనే తాము వచ్చిన పని పూర్తిగామరిచిపోయారు. వారిలో కపర్ది అనేవాడు కపర్దీశ్వరలింగాన్ని ప్రతిష్ఠించాడు.

మందరగిరి మీద ఉన్న శివుడికి కాశీ వార్త అయినా తెలియరాలేదు. యోగినులు ఏం చేస్తున్నారు? సూర్యుడు ఏమయాడు? బ్రహ్మదేవుడికి తాను జ్ఞాపకం ఉన్నాడా? ప్రమథులు అక్కడే కాపరం పెట్టారా ఏమిటి? ఇలా మథనపడుతూ శివుడు వినాయకుణ్ణి పిలిచి, అతనికి చెప్పవలసిందంతా చెప్పి, కాశీనగరానికి పంపాడు.

వినాయకుడు కాశీనగరం చేరి అక్కడ అనేక ఉత్పాతాలు కలగజేశాడు. అతను ఢుంఠి భట్టారకుడు అని పేరు పెట్టుకుని ప్రజల మధ్య తిరుగుతూ జోస్యం చెప్ప సాగాడు. కాశీనగరానికి త్వరలోనే చెడ్డ రోజులు రాబోతున్నాయనే పుకారు పుట్టించాడు. తరవాత అతను దివోదాసు భవనంలో ప్రవేశించి, రాజు అడిగిన ప్రశ్నలన్నిటికీ సరిఅయిన సమాధానాలు చెప్పి, రాజపురోహితులలో ఒకడుగా చేరిపోయాడు.

రాజు ఒకనాడు ఢుంఠి భట్టారకుణ్ణి, "కాశీనగరంలో ఉత్పాతా లెందుకు కలుగుతున్నాయి?" అని అడిగాడు.

"రాజా, కొంత కాలంపాటు నువు కాశీ విడిచి దూరంగా ఉండటం మంచిదని నాకు తోస్తున్నది. ఇంక పద్దెనిమిది రోజులకు ఉత్తరదేశం నుంచి ఒక బ్రాహ్మణుడు వస్తాడు. నీకు తగిన హితోపదేశం ఆయన చేయగలడు," అన్నాడు ఢుంఠి.

తరవాత శివుడు విష్ణుమూర్తిని కాశీకి పంపించాడు. విష్ణువు బుద్ధుడి రూపంలో వచ్చి కాశీపౌరులకు నాస్తికమతమూ, బౌద్ధ, జైనధర్మాలూ బోధించి, వారిలో ధర్మచింత పోగొట్టాడు. తరవాత ఆయన బ్రాహ్మణవేషం ధరించి దివోదాసుడి వద్దకు వెళ్ళి, ఆశీర్వదించాడు. దివోదాసుడు ఆయనతో, "అయ్యా, దేవతలు నన్ను చాలా రకాల బాధలు పెట్టుతున్నారు. నేను కూడా చాలా కాలం రాజ్యం చేసి, ముసలివాణ్ణి అయిపోయాను. నాకు మోక్షం ఎలావస్తుంది?" అని అడిగాడు.

"రాజా, కాశీనగరంలో లింగ ప్రతిష్ఠ చెయ్యి. నువు బొందితో కైలాసానికి పోతావు," అన్నాడు విష్ణువు.

ఆ ప్రకారమే దివోదాసుడు తన కుమారుడైన సమరంజయుడికి పట్టంగట్టి, గొప్ప గుడి కట్టించి, అందులో లింగ ప్రతిష్ఠ చేసి, తన కోసం వచ్చిన విమానం ఎక్కి, బొందితో కైలాసానికి వెళ్ళిపోయాడు. కాశీ విడిచి వెళ్ళిన దేవతలందరూ తిరిగి వచ్చారు. శివుడు నందివాహనం మీద తన గణాలన్నిటినీ వెంట బెట్టుకుని కాశీనగరానికి మళ్ళీ చేరుకుని ఎంతో తృప్తిపడ్డాడు.



# 131. "ట్రెవీ ఫౌంటెన్"

ఈ ఊట కొలను రోమ్‌నగరంలో ఉన్నది. నగరం నుంచి వెళ్ళిపోతున్న వాళ్ళు ఇందులో ఒక నాణెం వేసినట్టయితే వాళ్ళు మరొకసారి తిరిగి వస్తారని ఒక నమ్మకం. ఇందులోకి దిగి నాణాలు పోగు చేసుకునే కుర్రాళ్ళు ఈ ఆచారం వల్ల లాభం పొందుతూ ఉంటారు. నీటి ఎగువన ఉన్న శిల్పంలో వరుణదేవుడు ఎగిరే రథంలో చిత్రించబడి ఉన్నాడు.



Photo by Jadhav



బహుమతి
పొందిన వ్యాఖ్య

కొలిస్తే

పంపినవారు:
పంకా రాధాకృష్ణ

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు నవంబర్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జనవరి 1973 సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
చాండీగఢ్ సరస్సు

మూడవ అట్ట:
నైనిటాల్ సరస్సు

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటె 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు-26

*FOR PRECISION IN...*

# Colour Printing

*By Letterpress...*

...Its B. N. K's., superb printing that makes all the difference. Its printing experience of over 30 years is at the back of this press superbly equipped with modern machineries and technicians of highest calibre.




*B. N. K. PRESS*
*PRIVATE LIMITED,*
*CHANDAMAMA BUILDINGS,*
*MADRAS-26.*

